

# పూజ్యశ్రీ అమృతానందస్వామీజి మహారాజ్

శ్రీస్వాములవారు 90 సం॥ల వయసులో ఆదివారము 6 ఆగస్టు నెల 2023 సం॥లో తిరుపతిలో పరమపదించారు. స్వామి అమృతానందజీ మహారాజ్ శ్రీరామకృష్ణ పరంపరలో వుండిన అగ్రస్థాయి సన్యాసి. రామకృష్ణపరంపరలో గల భిన్నమైన కేంద్రాలయందు ఆయన సేవలందించిన వాటిలో ఆయనకు శ్రద్ధాంజలి నిర్వహించబడినది. శ్రీ స్వామీజి కామార్పుకూరు, విశాఖపట్టణము, చెన్నై కేంద్రాలలో తన సేవల నందించారు. పదవీవిరమణ అనంతరము స్వామీజి బేలూరు మఠంలోని ఆరోగ్య భవనంలో నివసించారు, చివరి దినాలు వారి కోరికననుసరించి తిరుపతి మఠంలో గడిపారు.

గౌరవనీయులైన స్వామి అమృతానందజీ మహారాజ్ శాస్త్రాలలో నిష్ణాతుడు. ఇంకా ప్రాచీన సంప్రదాయ విద్యలో విద్వాంసుడు. ఆయన బహుభాషా కోవిదుడు. కఠినమైన క్రమశిక్షణ, క్రమబద్ధమైన పనితీరు, మొక్కవోని సమయ పాలనతో తన నిత్యకృత్యములు, విధులను, తలపెట్టిన కార్యక్రమములను నిర్వహించడములో లోక విదితమైనవాడు. ఆయన పూర్వాశ్రమంలో ములకనాడు బ్రాహ్మణులు. పేరు శ్రీ విరూపాక్ష శాస్త్రిగారు.

# ఓం వేదాంతభేరి ఓం

సంస్థాపకులు : శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

సంపుటము : 57 డిశంబర్ 2023 సంచిక : 12

సంపాదకులు

**శ్రీ విద్యాస్వరూపానందగిరి స్వాములవారు**

సంపాదక మండలి

శ్రీ సంపూర్ణానందగిరి స్వాములవారు

శ్రీవిజయానంద బ్రహ్మచారి

కె.ఈశ్వర్

డాక్టర్ కె.సర్వోత్తమరావు, ఎం.ఎ., పిహెచ్.డి.,

శాశ్వత పోషక చందా రూ. 3000/- అంతకుమించి

సంవత్సర చందా రూ. 100/-లు , విడి సంచిక రూ. 10/-లు

విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిలు ) 25 డాలర్లు

చందా పంపవలసిన అడ్రసు : శ్రీ శుకబ్రహ్మాశ్రమము

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందా నెంబరు తప్పక వ్రాయవలెను.

స్వామి విద్యాప్రకాశానంద నగర్,
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు)
శ్రీకాళహస్తి, పిన్ - 517640
ఫోన్ : 95057 18452

Printed & Published by Sri Vidyaswarupanandagiri swami on behalf of Sri Sukabrahma Ashramam and Printed by Harshavardhan at C.N. Printer, TIRUPATI, Andhra Pradesh; Published at Sri Sukabramhasramam, Swami Vidyaprakashananda Nagar, Sri Sukabramhasramam Post, Srikalahasti-517 640, Tirupati Dist., Andhra Pradesh.

Editor : SRI VIDYASWARUPANANDA GIRI SWAMI



# వేదాంతభేరి



అనుష్ఠాన వేదాన్తాన్ని బోధించు మాసపత్రిక

సంపుటము : 57 డిశంబర్ 2023 సంచిక : 12

## విషయసూచిక



**ముఖచిత్రం : గీతోపదేశము**

10-12-2023 ధన్వంతరి జయన్తి

17-12-2023 ధనుర్మాసారంభం

18-12-2023 సుబ్రహ్మణ్యషష్ఠి (స్కన్ద షష్ఠి)

23-12-2023 గీతాజయన్తి, ముక్కోటి ఏకాదశి, వైకుంఠ ఏకాదశి

24-12-2023 దత్తాత్రేయ జయన్తి

# ప్రార్థన

1. ఓమ్ ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహే నమః ॥

2. ఓమ్ సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥

3. ఓమ్ శుద్ధాం సనాతనీమమ్బాం శోక మోహవినాశినీమ్ ।
కృష్ణస్వరూపిణీం గీతామిష్టదేవీం భజామ్యహమ్ ॥

4. ఓమ్ జాతాఽసి త్వం మురహరిముఖాజ్జాహ్నవీ తస్య పాదాత్
సర్వానభ్యుద్ధరతి భవతీ సా తు మగ్నాన్ విధత్తే ।
ప్రత్యగ్బ్రహ్మామృతరసనిధిం ప్రాప్య విశ్రామ్యసి త్వం
మాతర్గీతే జడనిధిమియం మాతి న త్వత్ప్రభావః ॥

* * *

5. జయ జయ భగవద్గీతే! జయ భవబన్ధన శమన సుచరితే ।
కాండత్రయ సంశోభితరూపే । ఖండిత త్రిభువన ఘనసన్తాపే ।
సాంఖ్య కర్మయోగాది విలసితే । సంశ్రిత సాధక జనకల్పలతే ।
పద్యసప్తశత భవ్యతరాంగే । పాప విభఞ్జన పావనగంగే ।
భక్తిజ్ఞాన సోపాన శోభితే । పరమయోగి హృత్పద్మభావితే ।
భగవత్ శ్రీముఖ పద్మమరన్దే । పార్థహృత్సదన భరితానన్దే ।
సకలోపనిషత్ సాగరజాతే । సన్మునిమథనాచల పరిపూతే ॥
శాన్తిసుఖప్రద పదమృతకిరనే । జనన మరణ భవసాగర తరణే।
భజన సమాజ సుభక్త హృదబ్జే । పరిపూజిత పావన పదాబ్జే ॥

రచన – శ్రీ నోముల అప్పారావు



# దదామి బుద్ధియోగమ్

- శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు

భగవంతుని ప్రీతితో నిరంతరము సేవించువారికి కలుగు మహత్తర ఫలితము భగవద్గీతలో వచింపబడినది.

**"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥"** అని

పరమభక్తులకు చక్కటి జ్ఞానయోగమును తాను ప్రసాదించెదనని భగవానుడు నుడువుచున్నారు. ఆ యోగము జీవుని పరమాత్మ కడకు చేర్చునట్టి నిరుపమ సామర్థ్యము కలది అయియున్నది. అయితే ఇట్టి మహోన్నత ఫలము చేకూరవలెననిన దానికి యోగ్యత, అర్హత కావలసియున్నది. ఆ యోగ్యతను నిరూపించుటకై ఇచ్చట రెండు క్రియలు ప్రస్తావింపబడినవి-

(1) నిరంతరము పరమాత్మ యందు చిత్తమును నెలకొల్పుట
(2) ప్రీతిపూర్వకముగ భగవంతుని భజించుట - అని.

ఈ రెండిటిలో మొదటిదానియందు 'నిరంతరము' (సతతయుక్తానాం) అని చెప్పుటవలన, కొంతసేపు మాత్రము దైవమును చింతించుట చాలదనియు, ఎల్లకాలములందును చింతింపవలెననియు బోధింపబడినది. అట్టి స్థితిని క్రమముగ అభ్యసింపవలెను. లోకములో పెక్కురు దృశ్యపదార్థములందే తమ చిత్తమును లగ్నపఱచుచున్నారుగాని భగవంతుని యందుకాదు. ఒకవేళ కొందఱు దైవమందు మనస్సును నిలిపినను, ఎల్లకాలములందును నిలుపువారరుదు. అందును ప్రీతిపూర్వకముగ, భక్తిపూర్వకముగ నిలుపువారింకను అరుదు. భగవానుని నిరంతరము ధ్యానించినను శ్రద్ధ, ప్రీతి, భక్తి అందు కలియనిచో ఆ ధ్యానము ఎక్కువ ఫలితము నీయదుగనుక 'ప్రీతిపూర్వకముగ' సేవింపవలెనని రెండవ

దానిలో చెప్పబడినది. పాఠశాలలో ప్రప్రథమమున ఉత్తీర్ణుడైన విద్యార్థికి అధికారులు గొప్ప బహుమతి నెట్లొసంగుదురో అట్లే ఆ ప్రకారముగ ప్రీతిపూర్వకముగ నిరంతరము తన్ను సేవించువారికి, ధ్యానించువారికి భగవానుడు తన కరకమలముద్వారా బుద్ధి యోగము (ఆత్మానాత్మ విచారణాశక్తి) అను గొప్ప పురస్కారము నొసంగుచున్నారు. ఓహో! ఎంతటి గౌరవము! ఆ భక్తుని యదృష్టమెట్టిది! అనేక జన్మార్జిత పుణ్యపుంజము ఫలించి ఇట్టి భాగ్యరేఖగ పరిణమించినదేయగును.

భగవానుడు భక్తునకొసంగు ఆ బుద్ధియోగము సామాన్యమైనది కాదు. జీవుని శివునిగ నొనర్చును. నరుని నారాయణునియొద్దకు చేర్చును. కనుకనే 'మాం ఉపయాన్తి' (దానిద్వారా వారు నన్ను చేరుచున్నారు) అని చెప్పబడెను. ఆ బుద్ధియోగము ద్వారా జనులు తన్ను తప్పక చేరగలరని భగవానుడు హామీ ఇచ్చిరి. 'బుద్ధియోగ' మనగా నేమి? బుద్ధి (Brain)కి చెందిన యోగము అనగా విచారణాసంబంధమగు యోగము (The Yoga of discrimination) అని అర్థము. దీనినే జ్ఞానయోగ మందురు. 'ఇది ఆత్మ ఇది అనాత్మ, ఇది నిత్యము, ఇది అనిత్యము; ఇది దృక్కు, ఇది దృశ్యము' – అని యిట్లు వివేచించి చూపునదే ఈ యోగము. శరీరమును, ఉపాధిని ఆత్మనుండి వేఱుపరచునదియే ఈ యోగము. దీనిని పొందినవాడిక ప్రపంచములోని ప్రతి వస్తువును విడదీసి 'అస్తి. భాతి, ప్రియ'ములను (సత్, చిత్, ఆనందములను) గ్రహించి 'నామ, రూప'ములను త్యజింపగలడు.

ఇట్టి బుద్ధియోగము, జ్ఞానయోగము ఎవరికి లభించుచున్నది? ప్రపంచములో అనేక కోట్లమంది జనులున్నప్పటికిని ఎవడు భక్తితో, ప్రీతిపూర్వకముగ నిరంతరము భగవంతుని ఆరాధించుచున్నాడో అతనికి మాత్రమే లభించుచున్నది. భక్తియే జ్ఞానముగ పరిణమించిపోవుచున్నది. భక్తియను పుష్పము వికసించి జ్ఞానఫలోత్పత్తికి దారితీయుచున్నది.

కొందఱిట్లు ప్రశ్నించుచున్నారు - "ఆత్మ పంచకోశాంతర్గతముగ నున్నాడని చెప్పుదురుగదా! మేమెప్పుడును బయటగల దేవునే - అనగా ఏ విగ్రహమునో, మూర్తినో పూజించుచున్నామే; మాకాయంతర్దృష్టి ఎపుడు కలుగగలదు? విగ్రహారాధన మొదలగువాని ద్వారా బాహ్యమున పూజ జరుపు మాయొక్క దృష్టి అంతరంగమందుగల ఆత్మవైపున కెపుడు మరలగలదు? సాకారము నిరాకారముగ ఎపుడు పరిణమించగలదు? బాహ్య సాకారదృష్టి అంతరంగ నిరాకారదృష్టిగ ఎపుడు మార్పునొందగలదు? విగ్రహమును బాహ్యమునగాదా మేము పూజించునది, అట్టిచో అంతరమునగల పరమాత్మను మేమెట్లుపొందగలము?" - ఈ మొదలగు ప్రశ్నలన్నిటికిని ఈ శ్లోకమున చక్కటి సమాధాన మొసంగబడినది. 'జీవుడా! ఆ ప్రకారమే కొంతకాలము ఏదియో రూపమున (సాకారముగ) నన్ను అర్చింపుము. సేవింపుము. అయితే ప్రీతితో సేవింపుము. శ్రద్ధతో, భక్తితో సేవింపుము. నిరంతరము సేవింపుము. దానిచే నేను సంతుష్టుడనై, అట్టి సగుణోపాసనచే ప్రీతి నొందినవాడనై నిర్గుణోపాసనకు వలసిన బుద్ధిబలమును, జ్ఞానయోగమునకు వలసిన ధీశక్తిని, ఆత్మానాత్మ విచారణకు వలసిన ప్రజ్ఞాపాటవమును ఒసంగెదను, దానిద్వారా నీవు నన్ను తప్పక బొందగలవు' అని భగవానుడు కరుణతో నిచట వచించిరి. దీనిచే పైన ప్రశ్నించినవారి సంశయములన్నియు పటాపంచలైపోయినవి. భగవాను డిచట భక్తులకు గొప్ప ఆశ్వాసమొసంగిరి.

మఱియు ఆప్రకారముగ జీవునకేక్షణమున భగవత్కరుణచే బుద్ధియోగము లభించునో ఆ క్షణమునుండి యాతడు నిరాకార పరమాత్మవైపునకు మొగ్గుజూపి అట్టి ఆత్మయొక్క అన్వేషణయందు, విచారణయందు దత్తచిత్తుడై యుండును. ఇదియే భక్తి జ్ఞానముగ మారునట్టి సుముహూర్తము. 'మా భక్తియోగము శ్రేష్ఠము, మా జ్ఞానయోగము శ్రేష్ఠము' అని కొట్లాడుకొనువారికి, 'భక్తికంటె జ్ఞానము గొప్పది, జ్ఞానముకంటె భక్తి గొప్పది' - అని వితర్కించుకొనువారికి భగవానుడీ శ్లోకమున గొప్ప గుణపాఠమును నేర్పిరి. రెండును అవసరములే. మోక్షమునకు రెండును

సహాయభూతములే. రెండింటికిని అవినాభావ సంబంధము కలదు. వాస్తవముగ రెండును ఒకే వస్తువైయున్నవి; భేదము లేదు. మొదటిదియగు భక్తి కాలాంతరమున రెండవదియగు జ్ఞానముగ మారగలదు. ఆ మారునట్టి లగ్నమేదియో, సుముహూర్తమేదియో ఈశ్లోకమున చక్కగ తెలుపబడినది. భక్తి పరిపక్వమగు సమయమే ఆ సుముహూర్తము. 'దాసోఽహ'మే కాలాంతరమున 'సోఽహ'ముగ మారును. 'దదామి బుద్ధియోగమ్' (నేను బుద్ధియోగము నిచ్చెదను) అని అసందిగ్ధముగ చెప్పినందున ఈ మార్పునకు భగవానుడే కారణభూతుడని స్పష్టమగుచున్నది. సమస్తచరాచర ప్రాణికోట్లయొక్క సూక్ష్మతర సంకల్పమునుగూడ బహుజాగరూకతతో పరిశీలించుచుండు పరమాత్మ భక్తునియొక్క హృదయక్షేత్రము నిర్మలభక్తిచే పరిప్లావితమగుటజూచి అట్టి సుక్షేత్రమున 'బుద్ధియోగ'మను (జ్ఞానయోగమను) బీజమును నాటును. అదియే మోక్షవృక్షముగ ప్రవృద్ధముకాగలదు. అనగా ఆ జ్ఞానయోగమే మోక్షసౌధమునకు జీవుని గొంపోవగలదు. 'దదామి' (తప్పక ఇచ్చెదను) అని నొక్కిచెప్పుటలో భక్తులపై భగవానునకు గల అపార కరుణ వ్యక్తమగుచున్నది. 'నిర్మలభక్తియను మూల్యమును నీవు చెల్లించినచాలును. బుద్ధియోగము (జ్ఞానయోగము) అని అలౌకిక మోక్షప్రద పదార్థమును నీ కొసంగెదన'ని భగవానుడు అభయమొసంగుచున్నారు. సాధ్యవస్తువు నపేక్షించువాడు సాధనను తప్పక చేయవలెను గనుక సాధ్యమగు మోక్షమును, భగవత్సాయుజ్యమును కాంక్షించువాడు తత్సాధనమగు బుద్ధియోగము (జ్ఞానయోగము)ను, దానికి కారణభూతమగు నిర్మలభక్తిని తప్పక సంపాదించవలెనని ఈ శ్లోకముద్వారా వ్యక్తమగుచున్నది. భక్తి సులభసాధ్యమైనది గనుక, ప్రథమమున సర్వులును దానినే ఆశ్రయించి తద్ద్వారా భగవత్కరుణచే జ్ఞానమునుబొంది మోక్షభాగులు కావలయును.



# గీతాశయము

- శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు



గీతయొక్క యాశయము బాగుగా నాలోచించిన అంతఃకరణశుద్ధి గలుగువరకు నిష్కామ కర్మయోగము, దైవభక్తి గలిగియుండుటయు, తరువాత సర్వసంగపరిత్యాగరూప సంన్యాసమును గలుగచేసుకొనుటయు నగుచున్నది. ఇచట సర్వకర్మ ఫలత్యాగము మాత్రము కాదు. సర్వకర్మలను గూడా త్యజించి యేకాంతమున బ్రహ్మనిష్ఠ చేయవలయుననియే యగును. భగవద్గీత నుపదేశించిన పిమ్మటనుపదేశించిన యుత్తరగీత ఈ తత్త్వమునే తెలుపుచున్నది. అయితే అంతఃకరణముయొక్క సంపూర్ణ శుద్ధి కలుగక సర్వకర్మ పరిత్యాగమగు బ్రహ్మనిష్ఠ చేయకూడదని గీత నొక్కి వక్కాణించుచున్నది.

గీతోపదేశము పొందిన అర్జునుడున్నూ, పంచపాండవులున్నూ దీనికి తార్కాణము. కనుకనే ధర్మరాజార్జునాదులు అయిదుగురున్నూ, ద్రౌపదియు నిష్కామ కర్మయోగమును బాగుగా ననుష్ఠించి, అంతఃకరణ శుద్ధి గలిగినపుడు సర్వసంగములను, గృహారామపుత్రపౌత్రాదులన్నిటిని త్యజించి పరమత్యాగులై, సాధువులై, సన్న్యాసులై, పాదచారులై తీర్థయాత్రలు చేసుకొని, ఋషులు పుణ్యాశ్రమములను, పుణ్యతీర్థములను, పుణ్యక్షేత్రములను దర్శించుకొని, అచ్చటచ్చటనేకాంత స్థలములో బ్రహ్మనిష్ఠ చేసుకొని, క్రమముగ పూర్వదిక్కు నుండి భూప్రదక్షిణము చేయుచు, తుదకు హరిద్వారములో కొంతకాలముండి, హృషీకేశమున చాలా కాలము తపస్సుచేసి అంత్యకాలమున స్వర్గారోహణము గావించిరి. హృషీకేశములోగల స్వర్గాశ్రమము మొదలగు అనేక పుణ్యతీర్థముల తీరములలో, వనములలో, ఏకాంత ప్రదేశములలో, గుహలలో పాండవులు

నివసించినట్లు నిదర్శనము లిపుడుగూడ కనబడుచున్నవి. ఇదే దీనికి దృష్టాంతము. భారతము మహాప్రస్థానిక పర్వము చూడుడు. ఇదే యథార్థమైన గీతయొక్క యుపదేశమగును.

అట్లు కానిచో సదా సంసారములో నుండిన ఆత్మశుద్ధి కలుగుటకున్నూ, నిర్వాణ మార్గములోగల సంకల్పము లనియెడు ప్రతిరోధములు తొలగుటకున్నూ, నిర్వాసనాస్థితి కలుగుటకున్నూ, బ్రహ్మానుసంధానము లభించుటకున్నూ, జ్ఞేయమగు తురీయపదములో నిరంతరము నిలుచుటకున్నూ తరము కాదు. జనుల హృదయములందు కాలక్రమముగా పవిత్రత, యేకాగ్రత తగ్గిపోయినందుచే జీవితము వ్యర్థమై పోగూడదని తలంచి గృహస్థాశ్రమములో నుండిననూ, కొంతవరకు నాత్మ శుద్ధి కలుగుటకొఱకు నిష్కామ కర్మయోగమున్నూ, దైవచింతనము, పరోపకారమున్నూ చేసేలాగున వర్తమాన కాలమునకు తగినట్లు పెద్దలు నిశ్చయించిరి. నాలుగు ఆశ్రమములు వేదమందు విధింపబడియుండ ఒక్క గృహస్థాశ్రమము మాత్రమే యావత్కాలము నిర్వహింపబడుచుండ వలయునని శ్రీకృష్ణ భగవానుడెట్లు ఉపదేశించియుండును? క్షత్రియ ధర్మమును గురించి చెప్పునపుడు రఘువంశమున కాళిదాసు ఈలాగున వర్ణించెను.

**శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్ ।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్ ॥**

శైశవ కాలమున బ్రహ్మచర్య వ్రతపాలనముతో విద్యనభ్యసించుటయు, యౌవన కాలమున గృహస్థాశ్రమమును నిర్వహించుటయు, వార్ధక్యము వచ్చినపుడు మునివృత్తి గలిగి తపస్సు చేయుటయు, అంత్యకాలమున యోగమార్గమున నుండి శరీరమును విడుచుటయే ధర్మమగును. ఈ విధి నెవ్వరు కాదని చెప్పగలరు? అదే నిజమైన సత్యమున్ను, శుద్ధమైన జీవితమున్ను అగును.



# యుద్ధ సమయంలో

## 18వ అధ్యాయాల గీతోపదేశముసంభవమా?

- శ్రీరామకృష్ణానంద స్వాములవారు, గండిక్షేత్రం

ప్రియమైన ఆత్మబంధువులారా!

భగవద్గీతకు సంబంధించి కొన్ని శంకలు ఆక్షేపణలు వున్నాయి. వాటిని విచారించుకొందాం.

“సర్వసైన్యాలు యుద్ధానికి సంసిద్ధమైవున్నాయి. ఇరువైపులా శంఖనాదాలు మ్రోగాయి. తారసిల్లడమే తరువాయి. ఈలాంటి సందిగ్ధ సమయంలో పద్దెనిమిది అధ్యాయాలు - యేడువందల శ్లోకాలు కల్గిన యింత గ్రంథాన్ని బోధించడం జరుగుతుందా? శ్రీకృష్ణుడు బోధిస్తూ అర్జునుడు వింటూంటే యెదుటి సైన్యాలు నిద్రబోతున్నాయా? ఆ సమయంలో అంత తీరుబడి యెక్కడిది‘ బహుశా యేమో! ఎంతో కొంత చెప్పివుండవచ్చు. తర్వాత వారు అంతలింతలు చేసి యింత గ్రంథాన్ని పెంచారు” అని వారి వాదం.

భగవద్గీతకు స్రష్ట శ్రీకృష్ణుడు, ద్రష్ట వేదవ్యాసుడు. ద్రష్ట అంటే ఆ తత్త్వాన్ని మొదటిసారిగా సాక్షాత్కారం పొందిన ఋషి అన్న మాట. కాబట్టే న్యాసవిధిలో “వేదవ్యాసోభగవాన్ ఋషిః, శ్రీకృష్ణపరమాత్మా దేవతా!” అని పఠిస్తూన్నాము. శ్రీకృష్ణ పరమాత్మ బోధించిన బోధను శ్లోక బద్ధంచేసి వేదవ్యాసుడు శాస్త్రాన్ని లోకానికి అందించాడు. ఉపనిషత్తులలోని మంత్రాలు కొన్ని అట్లట్లే, కొన్ని కొద్ది మార్పులతో, కొన్ని అర్థశః భగవద్గీతలోనికి వచ్చాయి. కాబట్టి దీనిని ఉపనిషత్సారమన్నారు. ఆ నాటి సమయంలో శ్రీకృష్ణుని బోధ వచన రూపంలోనూ శ్లోకరూపంలోనూ వుండి వుండొచ్చు. అచ్చటచ్చట

పునరుక్తులు, గోచరిస్తూన్నాయంటే అది తత్త్వశాస్త్రానికి భూషణమే కాని దూషణం కాదు.

సైన్యాలు సర్వాయత్తమై వుండే క్లిష్టసమయంలో యింతటి గ్రంథాన్ని బోధించే అవకాశమెక్కడిది? ఎదుటివారు వూరకుంటారా? అనే ఆక్షేపణకు సమాధానం చెప్పవలసి వుంది. ఆధ్యాత్మిక పక్షంగాను, లౌకిక పక్షంగానూ యీ ఆక్షేపణకు రెండువిధాలైన సమాధానాలు ఉన్నాయి. అందులో మొదటి సమాధానం ఆధ్యాత్మిక ప్రియులకు, శ్రద్ధాహృదయాలకు తృప్తిని కల్గిస్తుంది. కానీ ఆ సమాధానం తర్క హృదయులకు, హేతువాదులకు సంతృప్తి కల్గించలేదు. అట్టివారికి లౌకిక దృష్టిద్వారా సమాధానం కావాలె.

మొదట్లో ఆధ్యాత్మిక దృష్ట్యా సమాధానం చెప్పుకొందాం. భగవద్గీతలో పలుచోట్ల శ్రీకృష్ణునికి "హృషీకేశు'డనే పేరు వాడబడింది. హృషీకాలనగా యింద్రియాలు. వాటికి ప్రేరకుడు కాబట్టి ఆయనకు హృషీకేశుడనే పేరు కల్గింది. కేవలం అర్జునుని రథానికే కాదు. బ్రహ్మాండ రథానికే ఆయన చాలకుడు. హృషీకేశుడంటే పిండమనే గడియారానికి, బ్రహ్మాండమనే గడియారానికి "కీ" యిచ్చేవాడన్నమాట. మన మన గడియారాలకు బైట నుండి "కీ" యిస్తాము. ఆయన అంతర్యామియై వుండి "కీ" యిస్తాడు. అందరి హృద్దేశాలలో నివసిస్తూ అన్ని భూతాలను పరిభ్రమింప జేస్తూన్నానంటూ ఆయనే (18-61) అన్నాడు. అర్జునుని రథంపై కనబడే నల్లని స్వరూపం శ్రీకృష్ణుని పారమార్థిక స్వరూపం కాదు. అది మాయికమైన లీలాస్వరూపం. ఆయన నిజస్వరూపం సర్వాత్మకమైంది.

ఆ హృషీకేశ పరమాత్మే అర్జునునికి గీతాబోధ చేయ బూనుకొన్నాడు. ఆయన ప్రేరేపిస్తేకదా యెదుటివారు యుద్ధం చేసేది.

చైతన్యరూప పరమాత్మ యొక్క ప్రేరణలేనిదే యీ జడదేహాలకు కదిలే శక్తి ఉందా? ఆయన సంకల్ప ప్రేరణ జరిగే వరకూ గంటలు కాదు కదా! రోజులైనా సరే - ఆ సేన ఆ పట్టాన అట్టే వుండవలసిందే సుమా! భగవంతుని యెదుట సంభవాసంభవాల సమస్యే లేదు.

ఆధ్యాత్మిక దృష్ట్యా చెప్పిన సమాధానమిది. ఈ సమాధానంతో తృప్తిబొందని వర్గానికి భౌతిక దృష్ట్యా, రాజకీయ దృష్ట్యా సమాధానం చెప్పవలసివుంది. వినండి.

క్షత్రియ జాతికి యుద్ధం చేయుట స్వభావ సిద్ధమైన ధర్మం. యుద్ధం చేయుటలో కూడా ఒక ధర్మం, ఒక నీతి ఒక నియమం వుండాలె. ఆనాటి యుద్ధాలు ధర్మయుద్ధాలు, కురుక్షేత్రం సహజంగా ధర్మక్షేత్రం కూడా అయివుంది. ఇరుపక్షాలలోనూ ధర్మానికి సారంలాంటి మహానుభావులున్నారు. కౌరవసేనలో భీష్మద్రోణ కర్ణ కృపాది మహా మహామహితాత్ములున్నారు. అటు పాండవబలంలో శ్రీకృష్ణుని మాట అటుంచినా, సాక్షాత్తు ధర్మావతారం ధర్మరాజున్నాడు. అంతకూ చాలిన ఆయన తమ్ములున్నారు. విరాట ద్రుపద శల్యాదులగు పెద్దలున్నారు.

దగ్గరిలో యుద్ధ ప్రారంభం జరుగుతుందనే సమయంలో ఉభయ సేనా ప్రముఖులు సమావేశమై యుద్ధ సమయంలో పాటించవలసిన నియమసూత్రాలను యిరవై తొమ్మిదింటిని యేర్పరచుకొన్నారు. ఆ సేనలలోను ప్రతి యోధుడూ ఆ నియమాలను పాటించే తీరాలి.

ఆ నియమాలు మహాభారతంలో చెప్పబడ్డాయి. వాటి అన్నిటితో మనకిక్కడ పనిలేదు. ప్రస్తుతానికి ఒక్కటి మాత్రం గ్రహిస్తాం.

శత్రువు నిరాయుధుడైవుంటే, విహ్వాలుడై వుంటే, నిద్రావశుడైవుంటే తన స్థానంలో తాను లేకపోతే, ప్రతియోధుడు వానిపై శస్త్ర ప్రయోగం చేయరాదు. తిరిగి వాడు తన్ను తాను సంభాళించుకొనే వరకూ, స్వస్థుడయ్యేవరకూ, యుద్ధ సంసిద్ధత ప్రకటించే వరకూ యెదుటివాడు వూరక వుండవలసిందే.

అర్జునుడు "అశస్త్రుడై" వున్నాడు. శరచాపములు విసర్జించి శోక సంవిగ్నమానసుడై రథోపస్థుడై కూర్చున్నాడు. "రథోపస్థుడై" అనిన మాటను కొంత వివరించవలసివుంది.

ఆనాటి కాలంలో రథ నిర్మాణ పద్ధతి ఒక విధంగా వుండేది. ముందు భాగంలో సారథి కూర్చొనే చోట కొంత పల్లంగా వుంటుంది. సారథికి వెనుక రథికుడు కూర్చొనేచోటు కొంత యెత్తు, రథికునికి వెనుక పల్లమైన ప్రదేశంలో ఆయుధాలను అందించే పరిచారకుడుంటాడు. ఆ పరిచారకుడు కూర్చొనే చోటే రథోపస్థ ప్రదేశము. అర్జునుడు తాను కూర్చోవలసిన చోటును వదలి పరిచారకుడు కూర్చొనే చోటికి వెళ్ళి చతికిలపడ్డాడు.

అర్జునుడు మళ్ళీ తనచోట తాను ఆసీనుడై యుద్ధమునకు సన్నద్ధుడయ్యే వరకూ యెదుటివారు యుద్ధారంభం చేసే వీల్లేదు. ఇది యుద్ధనీతి. గీతాబోధ ముగిసిన తర్వాత శ్రీకృష్ణునితో "కరిష్యే వచనం తవ" (నీవు చెప్పినట్లు చేస్తాను) అని ప్రతిజ్ఞ చేసి అస్త్రశస్త్ర ధారియై అర్జునుడు తన స్థానాన్ని అధిష్ఠించాడు. ఆ తర్వాత యుద్ధప్రారంభం జరిగింది.

ఈ సమాధానంతో "యుద్ధారంభ సమయాన యింత గీతోపదేశానికి అవకాశమెక్కడి"దనే శంక నివారింపబడింది.

# వేదాన్తసారము

మూలము : 
శ్రీ సదానన్ద యోగీన్ద్రులు

అనువాదము : 
శ్రీ స్వస్వరూపానందగిరి స్వాములవారు 
(శ్రీ వసిష్ఠాశ్రమము)

*(గత సంచిక తరువాయి)*

<u>పుత్రాత్మవాద నిరూపణమ్</u> -

మూలము - ఇదానీం ప్రత్యగాత్మనాం ఇదమయమారోపయతీతి విశేషతః ఉచ్యతే । అతిప్రాకృతస్తు "ఆత్మావై జాయతే పుత్రః" ఇత్యాది శ్రుతేః స్వస్మిన్నివ స్వపుత్రేఽపి ప్రేమదర్శనాత్, పుత్రే పుష్టే నష్టే చాహమేవ పుష్టో నష్టశ్చేతి అనుభవాచ్చ పుత్ర ఆత్మేతి వదతి । చార్వాకస్తు "స వా ఏష పురుషోన్నరసమయ" ఇత్యాదిశ్రుతేః, ప్రదీప్తగృహాత్ స్వపుత్రం పరిత్యజ్యాపి స్వస్యనిర్గమ దర్శనాత్, స్థూలోఽహం, కృశోఽహం ఇత్యాద్యనుభవాచ్చ స్థూల శరీరమాత్మేతి వదతి । అపరశ్చార్వాకః "తేహ ప్రాణాః ప్రజాపతిం పితరమేత్య బ్రూయుః" ఇత్యాది శ్రుతేః, ఇన్ద్రియాణామభావే శరీర చలనాభావాత్ కాణోఽహం, బధిరోఽహం ఇత్యాద్యనుభవాచ్చ ఇన్ద్రియాణ్యాత్మేతి వదతి। అపరశ్చార్వాకః "అన్యోంతర ఆత్మా ప్రాణమయః" ఇత్యాదిశ్రుతేః, ప్రాణాభావే ఇన్ద్రియాది చలనాయోగాత్ అహం అశనాయావాన్, అహంపిపాసావాన్ ఇత్యాద్యనుభవాచ్చ ప్రాణ ఆత్మేతి వదతి। అన్యస్తు చార్వాకః " అన్యోంతర ఆత్మా మనోమయః" ఇత్యాదిశ్రుతేః, మనసి సుప్తే ప్రాణాదేరభావాత్ అహం సంకల్పవా నహం వికల్పవానిత్యాద్యను భవాచ్చ మన ఆత్మేతి వదతి । బౌద్ధస్తు "అన్యోంతర ఆత్మా విజ్ఞాన మయః" ఇత్యాది శ్రుతేః, కర్తురభావే కరణస్య శక్త్యభావాత్ అహం కర్తా, అహం భోక్తా ఇత్యాద్యనుభవాచ్చ బుద్ధిరాత్మేతి వదతి । ప్రాభాకర తార్కికౌ తు "అన్యోంతర ఆత్మా ఆనందమయః" ఇత్యాది శ్రుతేః, బుద్ధ్యాదీనాం అజ్ఞానే

లయదర్శనాత్ అహమజ్ఞః అహమజ్ఞానీత్యాద్యనుభవాచ్చ అజ్ఞానమాత్మేతి వదతః। భాట్టస్తు "ప్రజ్ఞాన ఘనఏవానందమయః" ఇత్యాదిశ్రుతేః, సుషుప్తౌ ప్రకాశాప్రకాశసద్భావాత్ మామహం నజానామీత్యాది అనుభవాచ్చ అజ్ఞానోపహితం చైతన్యమాత్మేతి వదతి । అపరో బౌద్ధః "అసదేవేద మగ్ర ఆసీత్" ఇత్యాదిశ్రుతేః, సుషుప్తౌ సర్వాభావాత్ అహం సుషుప్తౌ నాసం ఇత్యుత్థితస్య స్వాభావ పరామర్శ విషయానుభవాచ్చ శూన్యమాత్మేతి వదతి॥

అనువాదము – ఇప్పుడు ప్రత్యగాత్మయందు ఇది ఇది అనురీతిగా ఆరోపించు ప్రకారము విశేషముగా చెప్పబడుచున్నది. అతిప్రాకృతులైతేనో "ఆత్మే పుత్రుడుగ పుట్టుచున్నాడు" ఇత్యాది శ్రుతులచే తనయందువలె తన పుత్రుని యందును ప్రేమ ప్రదర్శించుటవలన పుత్రుడు సన్నగైనా, లావెక్కినా తానే సన్నగైనట్లు, లావెక్కినట్లు అనుభవమును పొందుటవలన పుత్రుడే యాత్మయని చెప్పుచున్నారు.

చార్వాకులైతేనో "ఈ పురుషుడు అన్నరసమయుడు" అను మొదలగు శ్రుతులచే కాలుచున్న ఇంటినుండి తన పుత్రుని విడిచిపెట్టికూడా తను బయటకు వచ్చివేయుట వలన, నేను లావుగా వున్నాను, నేను సన్నగా వున్నాను అను అనుభవమువలన స్థూల శరీరమే ఆత్మయని చెప్పుచున్నారు.

చార్వాకులలో ఇంకొకరు – "ఆ ప్రాణములు తండ్రియైన ప్రజాపతిని చేరి చెప్పినవి" అను మొదలగు శ్రుతులవలన, ఇంద్రియములు లేనిచో శరీరము చలించకపోవుట చేతను, నేను గ్రుడ్డివాడను, నేను చెవిటి వాడను అను అనుభవమువలన ఇంద్రియములే ఆత్మయని చెప్పుచున్నారు.

చార్వాకులలో మరొకరు "ఇంద్రియములకంటే వేరైన ప్రాణమయము ఆత్మ" అను మొదలగు శ్రుతుల చేత, ప్రాణములు లేనిచో ఇంద్రియములు చలించకపోవడముచేతను నేను ఆకలిగొనుచున్నాను, నేను దప్పిక గొనుచున్నాను యను అనుభవముచేతను ప్రాణమే ఆత్మ యని చెప్పుచున్నాడు.

చార్వాకులలో శ్రేష్ఠుడగు నింకొక చార్వాకుడు "ప్రాణమయ

ఆత్మకంటే వేరైన శ్రేష్ఠమైన మనోమయమే ఆత్మ" అను శ్రుతిచే మనస్సు సుప్తముకాగా ప్రాణాదులు కార్యసామర్థ్యము కలవి కాకపోవుటచే నేను సంకల్పించుచున్నాను. నేను వికల్పించుచున్నాను అను నీయనుభవముచే మనస్సే ఆత్మయని చెప్పుచున్నాడు.

బౌద్ధుడు "మనోమయముకంటే వేరై శ్రేష్ఠమైన విజ్ఞానమయమే ఆత్మ" అను శ్రుతిచేతను, కర్తయొక్క అభావమునందు కరణమునకు కార్యము చేయు శక్తి లేదను యుక్తిచేతను, నేను కర్తను, నేను భోక్తనను యనుభవముచేతను బుద్ధియే యాత్మ యనుచున్నాడు.

ప్రాభాకర తార్కికులు "విజ్ఞానమయముకంటే వేరైన ఆనందమయము ఆత్మ" అను శ్రుతిచే, బుద్ధ్యాదులు కూడా అజ్ఞానమునందు లయమగుచున్నవను యుక్తిచే, అజ్ఞుడను నేను, నేను అజ్ఞానము కలవాడనను అనుభవములచే అజ్ఞానమే ఆత్మ యనుచున్నాడు.

భాట్టులు "ప్రజ్ఞానఘనుడే ఆనందమయుడు" అను శ్రుతి చేత, సుషుప్తియందు అప్రకాశప్రకాశముల సద్భావమువలన, నన్ను నేను తెలియజాలకున్నానను యనుభవము చేత అజ్ఞానోపహిత చైతన్యమే ఆత్మయని చెప్పుచున్నాడు.

బౌద్ధులలో నొకడు "సృష్టికి పూర్వము అసత్తే యుండినది" అను శ్రుతిచే సుషుప్తిలో సర్వాభావము వలన నేను సుషుప్తిలో లేనని, లేచిన వానికి స్వభావముగా పరామర్శ విషయానుభవము కలుగుటవలన శూన్యమే ఆత్మయని నుడువుచున్నాడు.

(ఇట్లు పుత్రాత్మ వాదమునుండి శూన్యవాదము వరకు గల మతములు, పూర్వ పూర్వ మతములు ఉత్తరోత్తరమతముల ద్వారా ఖండింపబడినవాయెను. ఇక శూన్యవాది "అసదేవేదమగ్ర ఆసీత్" అను ఛాందోగ్యశ్రుతిని ప్రమాణముగా తీసుకొని శూన్యాత్మవాదమును ప్రదర్శించినను ఇదియు పూర్వపక్షముగనే తెలియదగును. ఏలనన ముమ్ముందు ఈ వాదమున్ను నిషేధింపబడుచున్నందువలన.)

**పుత్రాదులాత్మకాదని నిరూపించుట -**

మూలము - ఏతేషాం పుత్రాదీనాం అనాత్మత్వముచ్యతే । ఏతైః అతిప్రాకృతాది వాదిభిః ఉక్తేషు శ్రుతియుక్త్యనుభవాభాసేషు పూర్వపూర్వోక్త శ్రుతియుక్త్యనుభవాభాసైః ఆత్మత్వబాధదర్శనాత్ పుత్రాదీనాం అనాత్మత్వం స్పష్టమేవ । కించ ప్రత్యగస్థూలోఽ చక్షురప్రాణోఽ మనా అకర్తా చైతన్యం చిన్మాత్రం సదిత్యాది ప్రబల శ్రుతివిరోధాత్, అస్య పుత్రాదిశూన్యపర్యంతస్య జడస్య చైతన్యభాస్యత్వేన ఘటాదివదనిత్యత్వాత్, అహం బ్రహ్మేతి విద్వదనుభవ ప్రాబల్యాచ్చ తత్ శ్రుతి యుక్త్యనుభవాభాసానాం బాధితత్వాదపి పుత్రాది శూన్య పర్యంతం అఖిల మనాత్మైవ । అతః తద్భాసకం నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యస్వభావం ప్రత్యక్చైతన్య మేవాత్మ వస్త్వితి వేదాన్త విద్వదనుభవః ॥ ఏవమధ్యారోపః ॥

అనువాదము - అతి ప్రాకృతవాదులచేత చెప్పబడిన శ్రుతి, యుక్తి అనుభవాభాసములయందు పుత్రాదులు అనాత్మయని నిరూపించ బడుచున్నది. మున్ముందు చెప్పబడిన శ్రుతి యుక్తి అనుభవాభాసములు ఉత్తరోత్తర శ్రుతి యుక్తి అనుభవాభాసములచేత నిరాకరింప (ఖండింప) బడుటచే పుత్రాదులు అనాత్మలని సులభముగా సిద్ధమైనది. కాని "ప్రత్యగస్థూలోఽ చక్షురప్రాణోఽ మనా అకర్తా చైతన్యం చిన్మాత్రం సదిత్యాది" ప్రబల శ్రుతివిరోధము వలన, పుత్రాది శూన్యపర్యంతముగల జడపదార్థము చైతన్య ప్రకాశ్యమగుటచే ఘటాదులవలె అనిత్యమగుటవలన, నేను పరబ్రహ్మస్వరూపుడను అను విద్వదనుభవ ప్రాబల్యమువలన ఆయా శ్రు తి యుక్తి అనుభవాభాసములు బాధితమగుటవలన పుత్రాది శూన్యపర్యంతముగల సమస్త మాత్మగా తెలియదగినది. అందువలన ఆయా వస్తుభాసకమైన నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య స్వభావమైన ప్రత్యక్చైతన్యమే ఆత్మవస్తువని విద్వాంసులైన వేదాంతుల యనుభవము. ఇట్లు అధ్యారోపము తెలుపబడినది. (సశేషం)

ఓం శ్రీగురుభ్యోనమః

# విశ్వరూపసందర్శనయోగము - 25

- శ్రీ సర్వాత్మానందగిరి స్వాములవారు

వేదాధ్యయనము, తపస్సు, దానము, పూజా, యజ్ఞాలచేత పరమాత్మ దర్శనము సాధ్యపడనట్లైతే మరి అది ఏ విధంగా దర్శించబడగలదో ఆ ఉపాయాన్ని తెలుపుతున్నాడు పరమాత్మ.

**శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేనప్రవేష్టుం చ పరంతప ॥ 54**

అర్జునా! పరంతపా! ఈ విధమైన నేను అనన్యభక్తి చేతనైతేనో తత్త్వతః తెలుసుకొనడానికి, దర్శించడానికి, ఇంకా ప్రవేశించడానికి కూడా సాధ్యపడేవాడిని.

విశ్వరూప సందర్శనయోగంలో విశ్వమంతా తానే అని ప్రత్యక్షంగా అర్జునుడికి చూపాడు పరమాత్మ. దాని అర్థము ఏమిటి అంటే - పరమాత్మ ఒక్కటే వున్నది అంతేగానీ విశ్వమన్నది మరొకటి లేదు అని; దానిలో గల జీవులన్నీ గూడా ఏవీ లేవు అని. ఎంతవరకు జీవభావము వుంటుందో అంతవరకు జననమరణాలతో కూడివున్న మహా క్లేశమయమైన సంసారం తప్పదు. అందుచేత అటువంటి పరమాత్మ తత్త్వాన్ని యథావత్తుగా తెలుసుకొనడానికీ, దర్శించడానికి అంటే అవరోక్షంగా అనుభూతిని పొందడానికి ఇంకా ప్రారబ్ధానుభవము తరవాత ఆ సర్వవ్యాపక - పరమాత్మ స్వరూపంలో లీనమైపోవడానికి సులభమైన ఉపాయము అనన్యమైన భక్తి అని తెలుపుతున్నాడు.

భక్తి అంటే పరమాత్మ మీద ప్రేమ. ఇది నవవిధాలు. అర్చనము, వందనము, దాస్యము, శ్రవణము, పాదసేవనము,

స్మరణము, కీర్తనము, సఖ్యము, ఆత్మ సమర్పణము.

సామాన్యులైన జనులు ఈ మార్గాలలో దైవాన్ని గానీ లేక లౌకికులైనవారిని గాని సేవిస్తుంటారు. ఏ లక్ష్యంతో సేవిస్తారంటే ఇహలోక భోగాలైన పుత్ర కళత్ర ధన కనక వస్తు వాహన క్షేత్రాదుల మీద కోరికలను తీర్చుకొనడానికి, పురాణాలలోను ఇంకా చరిత్రలోను గూడా ఇటువంటి వారిని గురించి చెప్పబడింది. మరి కొందరు పరలోక భోగాల నిమిత్తము గూడా వైదిక కర్మల ద్వారా దేవతారాధనలు చేస్తారు. ఐతే ఈ లౌకిక వైదిక కర్మల ద్వారా పొందబడేవి అల్పమైన నశ్వరమైన భోగాలే. అవి సంసారాన్ని అంతము చెయ్యలేవు. అందుచేత నవవిధ మార్గాలలో కేవలము పరమాత్మానుగ్రహాన్ని సంపాదించి ఆయన తత్త్వంలో చేరిపోవడాన్నే లక్ష్యంగా పెట్టుకుని చేసే పరమాత్మ సేవనే అనన్యభక్తి అని చెప్పబడింది. దాని చేతనే పరమాత్మ స్థితియొక్క ప్రాప్తి సాధ్యమని "భక్త్యా త్వనన్యయా శక్యః" అనే వాక్యము తెలుపుతున్నది. పరమాత్మస్థితి అన్నది కేవలము గ్రంథాలు చదవటము, వ్రాయటము వంటి క్రియలతోనే సాధ్యపడదు; అది గురువులు, మహాత్ముల సాంగత్యము ద్వారా వారి అనుగ్రహము కలిగినప్పుడు లభిస్తుంది. అటువంటి మహాత్ములు ప్రత్యక్షదైవాలుగదా!

అనన్యభక్తి అన్నది ఏ విధంగా చెయ్యాలో దాన్ని గూడా పరమాత్మనే తెలుపుతున్నాడు.

**శ్లో॥ మత్కర్మకృత్ మత్పరమో మద్భక్తః సంగవర్జితః**
**నిర్వైరస్సర్వభూతేషు య స్సమామేతి పాండవ ॥ 55**

అర్జునా! నా గురించిన కర్మలను చేసేవాడు, నేనే లక్ష్యంగా కలవాడు, నా భక్తుడు, సంగాన్ని వదిలినవాడు, సర్వభూతాల యందు వైరమును చెయ్యనివాడు ఎవడో, వాడు నన్ను చేరతాడు.

**మత్కర్మకృత్ -** లౌకిక విషయభోగాల కోసము అనేకమైన ప్రయత్నాలను చెయ్యక, నాగురించిన కథలను, గీతాలను వినడము, పాడడము చేసేవాడు. నాగురించిన ధ్యానము, స్మరణము, జపము, పూజాదులను చేసేవాడు, నా తత్త్వాన్ని గురించి వివరించే భగవద్గీత, రామాయణ, భాగవత, ఉపనిషత్తులు మొదలైనవి అధ్యయనము చెయ్యడము, వ్రాయడము, శ్రద్ధగల వారికి బోధించటము, నా దేవాలయాలను దర్శించడము ఇత్యాదులలోనే సమయాన్ని వినియోగించేవాడు మత్కర్మకృత్ అని చెప్పబడతాడు. చరిత్రలో భగవంతుని ధామాన్ని పొందిన భక్తులందరూ ఈ విధంగానే చేశారు.

**మత్పరమః -** నన్ను చేరటమనేదే జీవిత ఏకైక లక్ష్యంగా పెట్టుకుని జీవనము చేసేవాడు, నన్ను చేరడానికి సహకరించని, ఉపయోగించని వస్తువులు, పదార్థాలు, మనుష్యులు, ప్రదేశాలు, వృత్తులు ఇత్యాదులనుండి దూరంగా వుండేవాడు, నన్ను చేరడానికి సహకరించే వాటిని విడవకుండా అంటిపెట్టుకుని వుండేవాడు. నా కోసము ఎదురు చూసేవాడు మత్పరముడు ఔతాడు.

**మద్భక్తః -** నవవిధ భక్తి మార్గాలలో ఒక్కటి లేక అన్నిటి ద్వారా నన్ను సేవించేవాడు నా భక్తుడు అని చెప్పబడతాడు.

**సంగవర్జితః -** ఫలానిది నాది అనే మమకారము లేనివాడు సంగవర్జితుడు. సామాన్యులు నాది అని భావించే పుత్ర కళత్ర మిత్ర గృహ ధన కనక వస్తువాహన క్షేత్రాదులనే వేటి మీద గూడా నాది అనే భావన విడిచిపెట్టినవాడని అర్థము. చివరికి తన దేహాన్ని కూడా తనది అనుకోడు. అటువంటి అన్నింటినీ జాగ్రత్తగా రక్షించుకుంటూ నేను సంతోషిస్తూ, ఇంకా వారిని గూడా సంతోషపెడుతూ సుఖంగా

జీవించాలి అనే భ్రాంతి లేనివాడు, అవి అన్నీ గూడా పరమాత్మ సంపద మాత్రమే అని భావించేవాడు సంగవర్జితుడు. సంగము వలననే గదా జన్మపరంపర ప్రాప్తిస్తున్నది!

**నిర్వైరస్సర్వభూతేషు** – విశ్వంలో గల చరాచరాలను పరమాత్మ రూపాలనుగా గ్రహించి వేటిమీద కూడా వైరభావము లేనివాడు; వాటికి కష్టాన్ని, బాధను కలిగించనివాడు. తనకు అపకారాన్నీ, బాధనూ కలిగించినవారి మీద సైతము ప్రతీకారవిరోధ భావాలు లేనివాడు. మనసులో గూడా వారికి కీడు, నష్టము కలగాలి అనే తలపు రానివాడు. ఆ విధంగా ఎట్లా వుండగలడు? ప్రతి జీవికి దుఃఖము, బాధ అన్నవి రెండు విధాలుగా ప్రాప్తిస్తుంది. ఒకటి తన ప్రారబ్ధానుసారము, రెండవది తన పొరపాటు వలన. రెండవదానికి ఎవ్వరూ గూడా ఇతరులను కారణాలుగా భావించరు. ఇక మొదటిది ప్రస్తుత జన్మలోగాని, గతజన్మలలో గాని తన ద్వారా ఇతరులు పొందిన బాధలకారణంగా తనపైన వారు ప్రతీకారాన్ని తీర్చుకుంటున్నారు. అందుచేత అది తన దోషమే అని గ్రహించి ఓర్పుతో సహించి, వారిమీద ద్వేషాన్ని, వైరాన్ని, ప్రతీకారాన్ని పెంచుకోక, వాటి పర్యవసానమైన జన్మాంతరాన్ని పొందక, మనసును పరమాత్మ మీదనే నిలకడగా వుంచి ఆయన ధామాన్ని చేరుకునేవారు అని శబ్దాలకు అర్థము.

ఈ శ్లోకంలో చెప్పబడిన విధంగా అభ్యాసమును చేసే మహానుభావుడు నన్ను చేరుకుంటాడని పరమాత్మ తెలుపుతున్నాడు.

పరమాత్మ బోధించిన మార్గంలో జీవనం చేసి ఆయన ధామాన్ని చేరెదముగాక! (సమాప్తము) ఓం తత్సత్.

# మనస్సు జిత్తులమారి

- శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

శిఖరమును చేరనంతవరకు తమ లక్ష్యము నెరవేరినదని పర్వతారోహకులు తలంపరు. సంగ్రామమున పాల్గొను సైనికులు శత్రువు జయింపబడనంతవఱకు తమ ధ్యేయము సఫలమైనదని భావింపరు. అట్లే ఆధ్యాత్మ మార్గమున యత్నశీలుడగు సాధకుడు బహుజన్మల నుండియు వేధించుచున్న మాయను, అజ్ఞానమును, ప్రతీపశక్తులను పూర్తిగ తుడిచిపెట్టనంతవఱకు తన కర్తవ్యము పరిసమాప్తమైనదని తలంపరాదు. మాయ నివురుగప్పిన నిప్పువలెనుండును. మనుజుడు దానిని జయించినట్లే భావించి సంబరపడుచుండును. కాని ఇంతలో ఏదియో యొక అవకాశము చూచుకొని అది తలవని తలంపుగ వచ్చి అమాంతముగ మీదపడుచుండును.

The mind has the knack of making the aspirant feel that he is its master; while in fact it makes a hopeless fool of him.

అని ఒక మహాత్ముడు నుడివినట్లు మనస్సు జిత్తులమారిది, తన్ను జయించివేసినట్లు తన యజమానికి అది విశ్వాసమును కలుగజేయును. కాని త్రుటిలో వానిని పరాభవించి తనదే పైచేయిగ గావించుకొనును.

కావున సాధకులు బహుజాగరూకులై ఇంద్రియములను, మనస్సును వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూచుచుండవలెను. జన్మార్జిత మలినవాసనా ప్రభావముచే ఇంద్రియాదులు తమకు ప్రియములైన దృశ్యవిషయములపైకే ఉరుకుచుండును. అత్తఱి విజ్ఞుడగువాడు వివేకమను ఆయుధమును ఆశ్రయించి వానికి ఈక్రింది విధముగ బోధించవలెను -

'ఓ మనస్సా! ఓ ఇంద్రియములారా! ఎన్ని జన్మ'లనుండి ఈ ప్రకారము విషయముల వైపునకు మీరు పరుగెత్తుచున్నారు? మీకేమైనా తృప్తికలిగినదా? ఇంకను కోటానుకోట్ల జన్మలు ఈ ప్రకారముగ అనుభవించినను తృప్తికలుగునను నమ్మకమేమైన మీకున్నదా? విషయ ముల వలన మీరు పొందు ఆనందము ఏపాటిది? ఎంతసేపుండును? అది శాశ్వతమా, లేక నశ్వరమా? అవిచ్ఛిన్నమా, లేక దుఃఖమిశ్రితమా? అతుకులబొంతవంటి ఈ అల్పసుఖముకొఱకై బహుమూల్యమైన ఈ మానవజన్మను వృథాచేయుట మీకు పాడియా? దివ్యమైన ఇట్టి అవకాశములు మఱల మఱల దొఱకునా? అనంత బ్రహ్మానంద పారావారమునకు వారసులైయున్న మీరు ఈ ప్రకారముగ కక్కుర్తిపడి అల్పవస్తువు కొఱకు జీవితమును ధారపోయుట న్యాయము కాదు. లెండు! పరాత్పరుని పాదయుగములను సేవించుటకై తక్షణమే కృతనిశ్చయులు కండు!'

ఈ ప్రకారముగ మనస్సునకు, ఇంద్రియములకు చక్కని హిత బోధచేసి వానియొక్క దర్పమును సాధకుడు అడంచవలెను. అయితే బహుకాలమునుండి ప్రాపంచిక వాసనలు రూఢిపడియుండుట వలన అవి వెంటనే చెప్పినమాట వినకపోవచ్చును. అయినను ప్రయత్నము వీడ రాదు. ఏనాటికైనను తత్త్వజ్ఞాన సహాయముచే వాసనాక్షయము పరిపూర్తిగ సంభవించి మనోనాశము లెస్సగ సిద్ధించినపుడే ఆత్మసాక్షాత్కారము కలుగగలదు. వాసనలు పైపైన నశించినట్లు కనిపించినను లోన వేరు పాతుకొనియుండును. తీగె ఎండిపోయినను దుంప నశింపనట్లు, సాధకుడు తాను చేయు సత్ప్రయత్నముల వలన వాసనల యొక్క ప్రకోపము ఒకింత ఉపశమించినను దానిని నమ్మరాదు.

'రసవర్జం' అని గీతాచార్యులు ఈ స్థితినే గీత రెండవ అధ్యాయమున చక్కగ వర్ణించి చెప్పిరి - వివేక వైరాగ్యాదులచే వాసనలు, దుర్గుణములు, దురభ్యాసములు, విషయ ప్రవృత్తులు సమూలముగ తొలగిపోనంతవరకు మనుజుడు సాధన చేయుచునేయుండవలెను. మధ్యలో నిలుపరాదు.

# దివ్యజనని శారదాదేవి ప్రబోధం

- శ్రీమతి గంగవరం శ్రీదేవి, తిరుపతి.

(గత సంచిక తరువాయి)

**2. సర్దుకుపోవడం :-** ఇది మాతృదేవి జీవితంలో మనకు కనిపించే ఇంకొక అపూర్వ అంశం, విషయం. మనతో మనం, మన చుట్టూ మనుషులతో, సమాజంతో, ఏ విధమైన వైషమ్యాలు, స్పర్ధలు లేకుండా, సంఘర్షణ లేకుండా జీవించడం. దీనినే నేటి ఆధునిక పరిభాషలో Possitive Approach అనీ Possitive Attitude అనీ అంటున్నారు.

శారద 18 సంవత్సరాల వయసులో భర్త దగ్గరకు దక్షిణేశ్వరానికై వచ్చింది. అక్కడ భవతారిణి కాళికాలయంలో వాద్య పరికరాలు ఉంచే అతి చిన్న గది (నహబత్)లో ఏ మాత్రం సౌకర్యాలు లేకుండా 13 సంవత్సరాలపాటు ఎంతో ఒదిగి ఉంటూ సర్దుకుపోతూ జీవించింది. గురుదేవులకు అత్తగారైన చంద్రమణీ దేవికి, గురుదేవుల కోసం వచ్చే ఎందరో భక్తులకు, శిష్యులకు విసుగు, విరామం లేకుండా చక్కగా వండిపెడుతూ ఎనలేని సేవ చేశారు. గొంతు క్యాన్సర్‌తో బాధపడుతున్న గురుదేవులను చికిత్స నిమిత్త, శ్యాంపుకూర్, కాశీపూర్‌లకు తీసుకువెళ్ళినప్పుడు ఎంతో సర్దుకుని సేవ చేసింది. సేవయే ఉత్కృష్ట సాధనగా గడిపిన ఈ కాలఘట్టంలో సర్వత్రా భగవంతుడి ఉనికిని అనుభూతం చేసుకునే ఉన్నతోన్నత స్థితితో అనేక దివ్య సమాధి అనుభవాలు కలిగాయి.

గురుదేవుల నిర్యాణం తర్వాత శారద జీవితం కామార్పుకూరు (గురుదేవుల జన్మస్థలం)లో కొద్దికాలం, తమ అమ్మగారి ఊరైన

జయరాం బాటీలో, తర్వాత కలకత్తాలో ఎక్కువ కాలం గడిచింది. ఈ స్థితిని కుటుంబ పెద్దగా శారదమ్మ చూపిన సహనం, బాధ్యత, క్షమ అపూర్వమైనవి.

భర్త మహాసమాధి చెందడంతో సుమంగళీ చిహ్నాలను తీసివేయబోయిన శారదమ్మకు గురుదేవులు కనపడి తనకు మృత్యువు లేదని, తానెక్కడికీ వెళ్ళిపోలేదని, ఆ గదిలో నుంచి ఈ గదిలోకి వచ్చినట్లే అని, అవి ఏవీ తీసివేయవద్దని ఆదేశించారు. కానీ అప్పటి రోజులలో ఒక చిన్న పల్లెటూరులో భర్త లేని స్త్రీ ఈ విధమైన సుమంగళీ చిహ్నాలను ధరించడమన్నది ఎంత తీవ్ర ఆక్షేపణను ఎదుర్కొని ఉంటుందో మనం ఊహించవచ్చు. సూటిపోటి మాటలు, అవహేళనలు, తిరస్కారాలు వీటితో పాటు తినడానికి తిండి, కట్టుకోవడానికి వస్త్రం సైతం లేకుండా ఎంతో దయనీయ పరిస్థితులను ఎదుర్కొన్నది. తర్వాత జయరాం బాటీలో సైతం మతిస్థిమితం లేని తమ్ముడి భార్య సురబాల, విచిత్రమైన ప్రవర్తనతో బాధించే ఆమె కుమార్తె రాధు, ఇంకొక తమ్ముడి కుమార్తెలు నళిని, మాకూ నిరంతరం డబ్బు పిచ్చితో తమ్ముళ్ళు ఈ విధంగా ఒకవైపు బాధాకరమైన, అశాంతిమయమైన కుటుంబ పరిస్థితులు - ఇంకొక వైపు తనను గురుదేవిగా, లోకమాతగా, సంఘజననిగా, ఆధ్యాత్మిక శక్తి స్వరూపిణిగా ఎనలేని భక్తివిశ్వాసాలు చూపే సన్యాస శిష్యులు, సాధారణ భక్తులు, ప్రజలు. ఈ వివిధ విధాలైన పరిస్థితులతో, పరిసరాలతో, భక్తులతో ఆ తల్లి ఏవిధమైన ప్రతికూలత, సణుక్కోవడం, విసుక్కోవడం లేకుండా ఎంతో సహనంతో సర్దుకుపోవడం చూసినపుడు ఎంతో ఆశ్చర్యపోవడం తప్పదు. ఇందుకు దోహదం చేసిన కొన్ని సద్గుణాలు “సహనం”, “మాధుర్యం”, “సరళత” , “నమ్రత”, “ఇతరుల లోపాలను ఎత్తి చూపక పోవడం.”

**3. అత్యున్నత సత్యంతో అనుబంధం :-** శారదకు 14 సం॥ వయసప్పుడు తన జన్మ ఒక సాధారణమైన సంఘటన కాదని, అందరిలా పుట్టి వెళ్ళిపోయే సామాన్యవ్యక్తి కాదని, తన జన్మకో సార్థకత ఉందన్న ఆత్మజాగృతి కలిగింది. గురుదేవులు ఆమెకు చేసిన ఉపదేశాలు గృహస్థ జీవితాన్ని పారమార్థికమయంగా ఎలా చేసుకోవాలో తెలియజేశాయి. లౌకిక రాహిత్యమైన పరమానంద స్థితిని నిత్యమూ అనుభవించే దివ్యపురుషుడైన పతిదేవుడిని సన్నిహితంగా గమనించడం, సూక్ష్మపరిశీలనాశక్తి, తీవ్ర అంతర్దృష్టి కలిగిన శారదకు గొప్ప వివేకోదయం! గురుదేవులు శారదలో వెలిగించిన జ్ఞానజ్యోతి దివ్య ప్రకాశపు కాంతిలో సమస్త సృష్టిని భగవన్మయంగా దర్శించడం శారదలోని ఆధ్యాత్మిక క్రమ వికాస పరిణామం. భగవత్సాక్షాత్కారమొక్కటే మానవ జీవిత పరమావధి అన్న గురుదేవుల ఆదర్శాన్ని తన అణువణువులోనూ నింపుకొన్న శారదలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలంత సహజంగా జపసాధన సాగింది. "ప్రచండ వాయువు మేఘ సమూహాలను ఛిన్నాభిన్నం చేసేట్లు పావన భగవన్నామం మనోమాలిన్యాలను తొలగించివేస్తుంది" అంటూ జపానికి అగ్రతాంబూలం ఇచ్చేవారు. క్రమం తప్పక నిర్దుష్ట సమయాలలో దైవారాధన చేయాలని చెప్పేవారు. తాను స్వయంగా పంచాగ్ని తపస్సు చేశారు. నాలుగు వైపులా ఆవు పిడకలతో 6 అడుగుల దూరంలో మంట వేసుకొని పైన సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తూ ఉండగా ఏడు రోజులపాటు తపస్సు చేయడం పంచాగ్ని తపస్సు. భగవాన్ శ్రీరామకృష్ణులు ఆ తల్లిని జగజ్జననిగా భావిస్తూ పూజాపీఠం మీద ఆసీనురాలిని చేసి షోడశపూజ నిర్వర్తించి తమ సమస్త తపోఫలాన్ని అమ్మకు ధారపోశారు. అమ్మలో ఆ శక్తిని ఆవహింప జేశారు. వీటన్నిటి ద్వారా శారద రామకృష్ణ సంప్రదాయపు దేవిగా, ఆధ్యాత్మిక సామ్రాజ్య మహారాజ్ఞిగా విరాజిల్లింది. తన దగ్గరకు

వచ్చే ఎందరో భక్తులకు, ఆర్తులకు, జిజ్ఞాసువులకు తగిన విధంగా పారమార్థిక సూచనలు, మంత్రదీక్షలూ ప్రసాదించేది. భగవంతుడు మనకత్యంత ఆప్తుడని అతనితో నిత్యమూ సన్నిహితమైన సంబంధం నెలకొల్పుకొమ్మని ఉద్బోధించింది. క్రమం తప్పక జపసాధన చెయ్యమని, ఏ కష్టం వచ్చినా భగవంతుడికి చెప్పుకొని కన్నీళ్ళతో ఆర్తిగా ప్రార్థించమని చెప్పేవారు. సర్వదేవదేవీ స్వరూపులైన భగవాన్ శ్రీరామకృష్ణులను గట్టిగా పట్టుకొమ్మని చెప్పింది.

మాతృదేవి, దివ్యజనని అయిన శారదాదేవి సందేశాలను, ప్రబోధాలను మన జీవితంలో ఆచరించడానికి కావలసిన అనుకూల పరిస్థితులను, శక్తిసామర్థ్యాలను, అచంచల భక్తివిశ్వాసాలను ప్రసాదించమని మూర్తిత్రయాన్ని వేడుకుందాం!

## కృతజ్ఞతలు

వేదాన్తభేరికి తమ విలువైన వ్యాసాలను అందించిన రచయితలకు హృత్పూర్వక కృతజ్ఞతలు. అట్లే పత్రికను పోషించుచున్న చందాదారులకు, పోషకులకు, ప్రకటన నిచ్చి సహకరించిన సుభద్రా చారిటబుల్ ట్రస్టు (హైద్రాబాద్) వారికి కృతజ్ఞతాభివందనములు. మీరందరు ఇక మీదట గూడ మీ సహకారాన్ని పత్రికకు అందించగోరుచున్నాము.

– వేదాన్తభేరి ప్రచురణ కర్త

## గీతాజయన్తి

మార్గశిర శుద్ధ ఏకాదశి శనివారము 23-12-2023 తేది వైకుంఠ ఏకాదశి - ముక్కోటి ఏకాదశినాడు గీతా జయన్తి శ్రీశుకబ్రహ్మాశ్రమంలో జరుగును. ఆ సందర్భంగా ఆనాడు భగవద్గీతకు, శ్రీకృష్ణ పరమాత్మకు షోడశోపచార అర్చన జరుగును. అట్లే 18 అధ్యాయాలు భగవద్గీత పారాయణ జరుగును.

# యాజ్ఞవల్క్యుడు

ప్రొఫెసర్ కె.ప్రతాప్, తిరుపతి.

గంగానదీ తీరంలో చమత్కారపురంలో సకల సద్గుణ సంపన్నుడయిన బ్రాహ్మణుడొకడు వుండేవాడు. నిరంతరం వేదాధ్యయనం చేస్తూ యజ్ఞాలను చేస్తూవుండటం వల్ల అతనిని యజ్ఞవల్క్యుడు అని పిలిచేవారు. బ్రహ్మజ్ఞాన ప్రతిపాదకాలయిన వేదాలను శిష్యులకు బోధించుటే వృత్తిగా కలిగినవాడు గనుక అతనిని బ్రహ్మరాతుడని కూడా పిలిచేవారు. అతని భార్య సునంద. వారికి కార్తీక శుద్ధ ద్వాదశి, భానువారం, ధనుర్లగ్నంలో ఒక కుమారుడు జన్మించాడు. అతనికి యాజ్ఞవల్క్యుడు అని నామకరణం చేశారు. అయిదో ఏట అక్షరాభ్యాసం, ఎనిమిదో ఏట ఉపనయనం తరువాత విద్యాభ్యాసం కోసం గురుకులంలో ప్రవేశ పెట్టారు. పౌష్కలుడు అన్న గురువుగారి వద్ద ఋగ్వేదాన్ని, జైమిని వద్ద సామవేదాన్ని, ఆరుణి వద్ద అధర్వణ వేదాన్ని నేర్చుకున్నాడు. యాజ్ఞవల్క్యుడు యజుర్వేదాధ్యయనం కోసం వ్యాస శిష్యుడయిన వైశంపాయనుని ఆశ్రయించాడు. అతనిలోని ఉత్తమ లక్షణాలను గుర్తించిన వైశంపాయనుడు శిష్యునిగా అంగీకరించాడు. శుశ్రూషతో గురుహృదయాన్ని మెప్పించిన యాజ్ఞవల్క్యుడు అనతికాలంలోనే యజుర్వేదాన్ని స్వాయత్తం చేసుకున్నాడు. విధివశాత్తు అతనిలో కొంతకాలానికి సాత్వికాహంకారం చోటు చేసుకుని గురువును ధిక్కరించే విధంగా మాట్లాడాడు. ఆగ్రహించిన వైశంపాయనుడు 'అహంకరించిన నీకు ఈ విద్య తగదని, దానిని తిరిగి ఇచ్చి వెళ్ళిపొమ్మని' కఠినంగా పలికారు. పశ్చాత్తాపపడిన యాజ్ఞవల్క్యుడు తాను నేర్చిన యజుర్వేద విద్యను రక్తరూపంలో వెడలగ్రక్కినాడు

పవిత్రమైన ఆ విద్యను అక్కడున్న ఋషులు కొందరు తిత్తిరి పక్షుల రూపంలో గ్రహించారు. ఇలా గ్రహించిన యజుర్వేద శాఖను తైత్తరీయ శాఖ అని అంటారు.

శ్రద్ధాళువయిన యాజ్ఞవల్క్యుడు నిరాశచెందకుండా ప్రత్యక్ష దైవమయిన సూర్యభగవానుని అనుగ్రహాన్ని సంపాదించాడు. యాజ్ఞవల్క్యుని సంకల్పాన్ని గ్రహించిన సూర్యుడు ఎవరికీ తెలియని యజుర్వేద మంత్రాలను అశ్వరూపంలో అతనికి ఉపదేశించాడు. అందువల్లనే ఆ మంత్రశాఖకు వాజసనేయ శాఖ (వాజం గుర్రం) అని, మధ్యాహ్న సమయాన ఉపదేశించబడినందున మాధ్యందిన శాఖ అని అన్నారు. సూర్యుని వలన యాజ్ఞవల్క్యుడు పొందిన వేదభాగం 'శుక్ల యజుర్వేదం' అని, అంతకుముందు గురువుగారికి తిరిగి యిచ్చిన వేదభాగం' కృష్ణయజుర్వేదం' అని ప్రసిద్ధి చెందాయి. ఆ తరువాత సరస్వతీదేవిని ప్రసన్నం చేసుకుని సకల విద్యలను సాధించుకున్నాడు. కణ్వుడు యాజ్ఞవల్క్యుని ప్రథమ శిష్యుడు. అతని ద్వారా వేదవిద్య లోకమంతా విస్తరించింది. ఈ పరంపరలోనివారిని కాణ్వశాఖీయులని, ప్రథమ శాఖీయులని పిలుస్తారు. శతపథ బ్రాహ్మణం యాజ్ఞవల్క్యుని మంత్ర సిద్ధికి తార్కాణమైతే, యాజ్ఞవల్క్య స్మృతి అతని సామాజిక ప్రజ్ఞకి సంకేతం.

గృహస్థాశ్రమంలో ప్రవేశించిన యాజ్ఞవల్క్యమహర్షికి మైత్రేయీ, కాత్యాయనీ అనే ఇద్దరు భార్యలు. కాత్యాయని ప్రాపంచిక జీవితానికి ప్రాధాన్యతనిస్తే, మైత్రేయి ఆధ్యాత్మవిద్యకి అంకిత మవుతుంది. వానప్రస్థాశ్రమానికి నిశ్చయించుకున్న యాజ్ఞవల్క్య మహర్షి ప్రాపంచిక సంపదను కాత్యాయనికి అప్పగించి, మైత్రేయికి ఆత్మతత్త్వాన్ని బోధించి బ్రహ్మవాదినిగా తీర్చిదిద్దుతాడు. వారిరువురి నడుమ జ్ఞాన వినిమయం 'మైత్రేయీ బ్రాహ్మణం'గా పిలువబడింది.

విదేహాధిపతి జనక మహారాజుకు బ్రహ్మజ్ఞానం అన్నా బ్రహ్మజ్ఞానులన్నా విశేషమైన ఆదరణ. బ్రహ్మ విద్యలో పారంగతుడయిన జ్ఞానిని సన్మానించాలన్న సంకల్పంతో సభను ఏర్పాటు చేస్తాడు. బంగారు నాణేలతో కొమ్ములనలంకరించిన వేయి గోవులను విద్వత్సభలో గెలుపొందినవానికి సన్మాన దక్షిణగా ప్రకటిస్తాడు. వివిధ దేశాల నుండి వచ్చిన పండితులతో సభ కళకళలాడుతుంది. పారితోషికం మీద మోహమున్నా పాండిత్య ప్రదర్శన చేయటానికి పండితులు తటపటాయిస్తారు. అటువంటి సందర్భంలో యాజ్ఞవల్క్యుడు లేచి గంభీరంగా సాలంకృతమయిన వేయిగోవులని తన ఆశ్రమానికి తరలించమని తన శిష్యులనాదేశిస్తాడు. తన బ్రహ్మజ్ఞానం పట్ల సందేహమున్నవారు తనను ప్రశ్నించవచ్చునని ఆహ్వానిస్తాడు.

జనక మహారాజు ఆస్థాన పండితుడయిన ఆశ్వలుడు, తపస్సంపన్నులయిన ఋతుభాగతనయుడు ఆర్తభాగుడు, భుజ్యుడు, ఉషస్తుడు, కహోలుడు, వాచక్నవి, ఉద్దాలకుడు, శాకల్యుడు వంటి వేదాంత దిగ్గంతులు లేవదీసిన ప్రశ్నలకు తడుముకోకుండా సమాధానాలనిచ్చి, మహరాజు ప్రకటించిన సాలంకృత సహస్ర గోదక్షిణకు తాను సర్వాత్మనా సమర్థుడని నిరూపిస్తాడు. సమస్త విద్వన్మండలం యాజ్ఞవల్క్యుడు బ్రహ్మిష్ఠులలో వరిష్ఠుడని త్రికరణ శుద్ధిగా జయజయధ్వానాలు పలుకుతారు. జనకమహారాజు నిజమైన విదేహస్థితిని పొంది, తన సమస్త సామ్రాజ్యాన్ని మహర్షి పాదాలకు సమర్పిస్తాడు. యాజ్ఞవల్క్యుని యజ్ఞస్వరూపాన్ని, ఆత్మశక్తిని, ధీశక్తిని గుర్తించిన పండిత సమూహం అతనిని 'యోగీంద్రుడ'ని ప్రశంసిస్తుంది.

సాక్షాత్ యజ్ఞస్వరూపాయ యాజ్ఞవల్క్యాయ మంగళమ్.

# శ్రీమదాంధ్ర మహాభాగవతం

- ఆచార్య జక్కంపూడి మునిరత్నం, తిరుపతి

## చతుర్థ స్కంధం

బాలు తపము మెచ్చి పైపదమిచ్చిన
పరమకారుణికుని పాదములను
ప్రజలబాధ బాప వసుధను పితికిన
స్వామి పాదములను సంస్మరింతు

**స్వాయంభుమనువు కుమార్తెల వంశాభివృద్ధి:** సూతమహర్షి శౌనకాదులతో మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు.

"ప్రాయోపవేశానికి సిద్ధమైన పరీక్షిత్తు మహారాజుతో శుకమహర్షి చెప్పడం కొనసాగించాడు."

"రాజా! చెబుతున్నా విను. మైత్రేయమహర్షి విదురుడితో మళ్ళీ ఇలా అన్నాడు."

"విదురా! విను. స్వాయంభు మనువుకు శతరూప ద్వారా ఇద్దరు కుమారులు జన్మించారు. వారు ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు'. ముగ్గురు కూతుళ్ళు పుట్టారు. ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనేవి వారిపేర్లు. పెద్ద కుమార్తె ఆకూతిని 'రుచి' అనే మహర్షికిచ్చి పెళ్ళిచేశారు.

ఆకూతికి, రుచికి 'యజ్ఞుడ'నే పేరుతో మహావిష్ణువు జన్మించాడు. లక్ష్మీదేవి కూడా తన అంశతో 'దక్షిణ' అనే పేరుతో జన్మించింది. మనువు తన మనుమడు యజ్ఞుణ్ణి తీసుకువచ్చి పెంచుకున్నాడు. తండ్రి రుచి ప్రజాపతి ఇంట్లోనే దక్షిణ పెరగసాగింది. యుక్త వయస్సు వచ్చింది. దక్షిణ యజ్ఞుణ్ణి భర్తగా వరించింది. యజ్ఞుడు ఆమెను వివాహం చేసుకున్నాడు.

ఆ దంపతులకు పన్నెండుమంది కుమారులు పుట్టారు. తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇడస్పతి, ఇద్మ్ముండు, కవి, విభుడు, వహ్ని, సుదేవుడు, రోచనుడు అనేవి వారిపేర్లు. వీళ్ళను 'తుషితులు' అని కూడా వ్యవహరిస్తారు. వీళ్ళంతా బలవంతులు. స్వాయంభు మన్వంతరంలోనే ఈ తుషుతులు దేవతలయ్యారు. యజ్ఞుడు దేవేంద్రుడయ్యాడు. మరీచి మొదలైన ఋషులు సప్తర్షులయ్యారు. స్వాయంభుమనువు కుమారులైన ఉత్తానపాద, ప్రియవ్రతుల సంతానంతో స్వాయంభు మన్వంతరం నిండిపోయింది.

బ్రహ్మదేవుడి ఆదేశానుసారం స్వాయంభు మనువు సృష్టికి ఉపక్రమించాడు. తన కుమార్తెల సంతానంతోనూ, కుమారుల సంతానం తోనూ సృష్టి పెంపొందేట్టు చూశాడు. కాబట్టి స్వాయంభుమనువే ప్రథమ మానవుడుగా పరిగణింపదగినవాడని తెలుస్తూ ఉంది. మానవ సంతతికి ఆద్యుడు కూడా ఇతడేనని బోధపడుతూ ఉంది.

మనువు కుమార్తెలయిన ఆకూతికి, దేవహూతికి ఇద్దరికీ విష్ణువే కుమారుడుగా జన్మించడం విశేషం. సృష్టి పెంపుపట్ల విష్ణువుకుగల అభిలాషను ఇది విస్పష్టం చేస్తుంది. యజ్ఞుడూ, దక్షిణ అన్నా చెల్లెళ్ళుగా జన్మించినప్పటికీ ఆ ఆదిదంపతుల వివాహం నిషిద్ధంగా పరిగణింపబడలేదు. పైగా అప్పటికి వివాహవిధిలో కులగోత్రాల పాత్ర ఉన్నట్లు కనిపించదు.

సప్తఋషులు పదవులే కానీ వ్యక్తులు కారు. కాలానుగుణంగా ఇంద్రాదుల్లాగే వీరుకూడా మారుతూ ఉంటారని మరీచి మొదలైన వారి వృత్తాంతాన్ని బట్టి తెలుస్తూ ఉంది.

**కర్దమ ప్రజాపతి సంతతి:** మనువు తన రెండవ కుమార్తె దేవహూతిని కర్దమ ప్రజాపతికిచ్చి వివాహం చెయ్యడం గురించి, వారి సంతానం గురించి నీకిదివరకే చెప్పాను. మరీచి మహర్షికి, కర్దమపుత్రిక కళకు కశ్యపుడు, పూర్ణిమ పుట్టారు. కశ్యపుడి సంతానంతోనూ, పూర్ణిమ

సంతానంతోనూ నిఖిల విశ్వమూ నిండిపోయింది. పూర్ణిమకు 'విరజుడు' అనే కుమారుడు, దేవకుల్య అనే కుమార్తె పుట్టారు. ఈ పూర్ణిమే తరువాతి జన్మలో విష్ణువు పాదాలు కడిగిన జలంగా, స్వర్గంగా రూపొందింది.

కర్దమ ప్రజాపతి కుమార్తె అనసూయద్వారా అత్రిమహర్షి ముగ్గురు కుమారులను పొందాడు. వారు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాంశలతో జన్మించారు."

"మహర్షీ! సృష్టి, స్థితి, లయాలకు కారణభూతులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అనసూయా అత్రి మహర్షులకు కుమారులుగా ఎందుకు జన్మించారో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది" అని విదురుడు మైత్రేయుణ్ణి ప్రశ్నించాడు. మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు.

"విదురా! నీప్రశ్న సమంజసంగానే ఉంది. సమాధానం చెబుతున్నా విను. విధి ప్రేరణవల్ల అత్రిమహర్షికి తపస్సు చెయ్యాలనే బుద్ధి పుట్టింది. భార్య అనసూయతో కలిసి 'ఋక్షం' అనే కులపర్వతానికి వెళ్ళాడు. అక్కడ నిర్వింధ్యానది పెద్దపెద్ద అలలతో ప్రవహిస్తూ ఉంటుంది. ఆ జల సమృద్ధి వల్ల దాని తీరంలో దట్టమైన అడవి వెలసింది. అత్రి మహర్షి ఆ అడవిలో తీవ్రమైన తపస్సు కొనసాగించాడు. ఇంద్రియాలను జయించాడు. ప్రాణవాయువును బిగబట్టాడు. ఒంటికాలిమీద నిలబడి వంద దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. అతని శరీరం బాగా కృశించింది. తనతో సమానుడైన కుమారుణ్ణి ప్రసాదించమని సమస్త లోకాధీశ్వరుణ్ణి శరణు కోరుతున్నాను అని అత్రి తన మనస్సులో తలపోయసాగాడు. అత్రిమహర్షి శిరస్సు నుంచి అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ అప్పుడు అక్కడికి వచ్చారు. వారి కీర్తిని గానంచేస్తూ అప్సరసలు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మునులు వారిని వెంబడించి వచ్చారు.

బ్రహ్మ పసుపుపచ్చని రంగుతో హంసను అధిరోహించి ఉన్నాడు. ఆయన చేతిలో కమండలం ఉంది. విష్ణువు మేఘాన్ని తలపించే నల్లని

రంగుతో గరుడుడి మీద కూర్చొని ఉన్నాడు. అతడి చేతిలో చక్రం ఉంది. మహేశ్వరుడు వెన్నెలను తలపించే తెలుపురంగుతో వృషభం మీద ఉన్నాడు. ఆయన చేతిలో త్రిశూలం ఉంది. అత్రి వారిని తిలకించి పులకించాడు. ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. పుష్పాంజలి సమర్పించాడు. చేతులు మోడ్చి నిలబడ్డాడు. త్రిమూర్తుల దివ్యతేజస్సు చూడలేక కళ్ళు మూసుకున్నాడు. వారి పాదాలమీద మనస్సు నిలిపాడు. మృదుమధురంగా వారిని కొనియాడాడు.

"బ్రహ్మ విష్ణు మహేశ్వరులారా! ప్రతి కల్పంలోనూ మీరీ ప్రపంచాన్ని పుట్టిస్తారు, పోషిస్తారు, లయం చేస్తారు. తత్త్వమెవ్వరికీ అంతుపట్టదు. నేను ఒకరినే పిలిచాను. మీరు ముగ్గురు వచ్చారు. మీ ముగ్గురిలో నేను పిలిచినవారెవరు? నాకు అంతా వింతగా ఉంది. నేను ఒక్కరినే మనస్సులో నిలుపుకొని సంతానం కోసం చాలా పూజలు చేశాను." అత్రి మహర్షి మాటలకు త్రిమూర్తులానందించారు. వారి నోటినుంచి అమృతాన్ని తలపించే మాటలు వెలువడ్డాయి.

"మేము ముగ్గురం అయినప్పటికీ వాస్తవానికి ఒక్కరమే. కాబట్టి నువ్వు ఒక్కరిని పిలిచినప్పటికీ మేము ముగ్గురమూ వచ్చాము. నీ కోరిక తప్పక నెరవేరుతుంది. మా అంశలతో నీకు ముగ్గురు కుమారులు జన్మిస్తారు. నీ కీర్తిని మూడులోకాల్లోనూ వ్యాపింపజేస్తారు".

అత్రి మహర్షికి ఆవిధంగా వరమిచ్చిన త్రిమూర్తులు ఆయన పూజలందుకొని అంతర్హితులయ్యారు. తరువాత అనసూయ అత్రి దంపతులకు బ్రహ్మ అంశతో చంద్రుడూ, విష్ణు అంశతో దత్తుడూ, మహేశ్వరుడి అంశతో దూర్వాసుడూ జన్మించారు. వాళ్ళు ముగ్గురూ మంచి బుద్ధిమంతులు, గుణవంతులు.

అంగిరసుడికి శ్రద్ధ అనే భార్య ద్వారా నలుగురు కుమార్తెలు పుట్టారు. వారు సినీవాలి, కుహువు, రాక, అనుమతి. ఇద్దరు కుమారులు పుట్టారు. ఉచథ్యుడు, బృహస్పతి.

# గోప్రశస్తి

– డా॥ సముద్రాల లక్ష్మణయ్య (తిరుపతి)

*( శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు ఒక పరమ గురుభక్తుడు. వారి రచనలలో, వ్యాసాలలో శ్రీ సద్గురు మలయాళస్వాములవారిని ఉదహరించబడని వ్యాసమే ఉండదు. వారికి కలము, గళము, ప్రజ్ఞ, పాండిత్యము భగవంతుడిచ్చిన ఒక వరము. వారి శరీరమదృశ్యమైనా, వారు చిరంజీవులు. మదిలో మాటిమాటికి కనిపిస్తున్నారు. కనిపిస్తుంటారు – సంపాదకుడు )*

గావో మమాగ్రతః సన్తు గావో మే సన్తు పృష్ఠతః ।
గావశ్శిరసి మే సన్తు గవాం మధ్యే వసామ్యహమ్ ॥ (మత్స్యపురాణం)

"గోవులు నా ముందు, నా వెనుక, నా శిరస్సు వైపున ఉండుగాక! గోవుల నడుమ నేనున్నాను" అని పై శ్లోకానికి భావం. గోవులకూ, మనుజులకూ మధ్య ఉండదగిన సంబంధాన్ని మత్స్య పురాణంలోని ఈ శ్లోకం నొక్కి వక్కాణిస్తున్నది.

ఈ విశ్వం చరాచర ప్రాణి కోట్లతో నిండి యున్నది. మనుజులు, పశువులు, పక్షులు మున్నగునవి చరప్రాణులు. చెట్లు, చేమలు మున్నగునవి అచర ప్రాణులు. ఈ ప్రాణులు వేటికవి విడిగా జీవించలేవు. వాటి జీవన విధానం పరస్పరాశ్రితమై యున్నది.

జంతువులతో మానవులకు గల సంబంధం సువిదితమే. అందులోనూ గోవులతో గల సంబంధం అతి సన్నిహితమూ, అతి శ్రేష్ఠమూ, అత్యావశ్యకమూ అయి వున్నది. పాలు, పెరుగు, నెయ్యి మున్నగు ఆహార పదార్థాలు గోవుల నుండే మనకు లభిస్తున్నవి. అందుకే "వినా గోరస కోరసోభోజనానాం" – "గోరసం లేని పక్షంలో భోజనంలో ఇక ఆస్వాదయోగ్యమైన రసమేది" అని ప్రశ్నించారు. మాతృస్తన్యం లాగానే

గోక్షీరం కుడా మనుజ శిశువులకు పోషకమై యున్నది. అందుచేతనే గోవును మాతగా పూజించే సంప్రదాయం భారతీయులలో ఏర్పడింది.

"గావో విశ్వస్య మాతరః" – "గోవులు విశ్వానికి తల్లులు" అని మన ప్రాచీనులు గోమాతను ప్రశంసించి యున్నారు.

"పదునాలుగు భువనంబులు
కుదురుగ నీ క్షుకి నిల్పుకొను నేర్పరివై' అని శ్రీకృష్ణ భగవానుణ్ణి కవులు కీర్తించారు. కృష్ణుడు బాల్యంలోనే తల్లికి తనలో నున్న పదునాలుగు లోకాలను చూపాడు. ఆ విశ్వరూప దర్శనం ఆమెకు ఆశ్చర్యం కల్గించింది. అట్లే 'గవామంగే తిష్ఠన్తి భువనాని చతుర్దశ' అని గోవులలో పదునాలుగు భువనాలున్నట్లు పెద్దలు గో ప్రశస్తిని వినుతించారు. గోవును ఆరాధిస్తే విశ్వ రూపధారియైన భగవంతుణ్ణి ఆరాధించినట్లే అని దీనివల్ల తెలుస్తున్నది.

గావః పుణ్యాః పవిత్రాశ్చ గోధనం పావనం తథా ।
గావో భవిష్యం భూతంచ గోషు సర్వం ప్రతిష్ఠితమ్ ॥

అని పురాణాలు గోవులలో సర్వమూ ప్రతిష్ఠితమై యున్నదనీ, మన భూత భవిష్యత్తులు గోవులే అనీ, గోధనం పరమ పావనమైనదనీ వర్ణించాయి. మానవులకు దానం చాలా ప్రశస్తమైన గుణం. అందుకే 'దాతా భవతి వా నవా' అన్నారు. పూర్వం దాతలు ప్రధానంగా గోవులనే దానంగా ఇచ్చేవారు. గోదాన ఫలాన్ని స్మృతులు, పురాణాలు ఘనంగా ప్రశంసించాయి.

గోదానం లాగా గోపూజ గూడా ప్రశస్తమే. గృహ ప్రవేశాది శుభ కార్యాలలో గోవును పూజించడం కద్దు.

గోపూజ వివిధ శుభాలను ప్రసాదిస్తుంది. రఘువంశ చరిత్రంలో సంతానహీనుడైన దిలీప మహారాజు వసిష్ఠుని సూచననుసరించి గోపూజ కావించి సంతానవంతుడయ్యాడని మహాకవి కాళిదాసు వర్ణించాడు.

గోవు సాధు జంతువు. జంతువులలో సింహాదులైన క్రూరమృగాలు కూడా ఉన్నాయి. అవి ఇతర ప్రాణులను చంపి వాటి మాంసం తిని జీవిస్తాయి. గోవులో అట్టి క్రౌర్యం లేదు. అది శాకాహారి. దాని నుండి మానవులు అహింసా తత్త్వం నేర్చుకోవాలి. జాతరల వంటి కార్యాలలో పశుబలి నిషేధాన్ని తూ.చా. తప్పకుండా పాటించాలి.

గోవుల విశిష్టతను గురించి వేదాలు, ఉపనిషత్తులు, స్మృతులు, శాస్త్రాలు, కావ్యాలు పలు విధాలుగా వర్ణించాయి. కథా కథన విధానంతో కొన్ని గ్రంథాలు గోవుల ఉత్కృష్టతను వివరించాయి. సత్య కామ జాబాలి మున్నగు వారి పవిత్ర చరిత్రలు ఉపనిషత్తులలో చదివితే గో సేవకు గల ప్రాముఖ్యం చక్కగా గోచరిస్తుంది.

భారతీయుల ఒక పవిత్రమైన పనిని యజ్ఞమంటారు. భారతంలో గోవును యజ్ఞాంగా, అథవా యజ్ఞాఙ్గంగానే పేర్కొనడమైనది. అది లేకుంటే యజ్ఞ నిర్వహణ జరగదు.

యజ్ఞాంగం కథితా గావో యజ్ఞ ఏవచ వాసవ!
ఏతాభిశ్చ వినాయజ్ఞో న వర్తేత కథంచన ॥ (భారతం ఆనుశాసనికం)

యజ్ఞాంగమంటే యజ్ఞంలో బలియిచ్చే పశువుగా భావించరాదు. నీచమైన అట్టి కృత్యాలకు ఈ వైజ్ఞానిక యుగంలో స్థానం లేదు. యజ్ఞారంభంలో గోపూజ నిర్వహించవచ్చు. ఆ పూజనే యజ్ఞంగానో, యజ్ఞాంగంగానో భావించారు.

శరీరాలకు రోగాలు రావడం సహజం. వాటికి తగిన చికిత్సలు చేయాలి. ఆ చికిత్సలు, ఔషధాలు పలు రకాలు. అన్నింటికంటే సులభంగా అందుబాటులో ఉండే మందులు మనకు ఎక్కువగా ఉపకరిస్తాయి.

గోమూత్రం గోమయంక్షీరం దధి సర్పిస్తథైవ చ ।
గవాంపంచ పవిత్రాణి నిర్దిష్టాని మనీషిభిః ॥

అన్నట్లు ఈ శ్లోకంలో పేర్కొన్న గోమూత్రాది పంచగవ్యాలు అనేక రోగాలకు తగిన ఔషధాలుగా పేర్కొనబడి వున్నాయి. శ్రీలక్ష్మీదేవి గోవుల మలమూత్రాలలో నివసిస్తుందని భారతంలోని గో శ్రీ సంవాదంలో చెప్పడమయింది.

విష్ణు ధర్మోత్తర పురాణంలోని ఈ క్రింది శ్లోకం గమనార్హం.

గవాం హి తీర్థే వసతీహ గంగా పుష్టి స్తథా తద్రజసి ప్రవృద్ధా ।
లక్ష్మీః పురీషే ప్రణతౌ చ ధర్మః తాసాం ప్రణామం సతతంచ కుర్యాత్
(293-42)

దీని భావమిది. "గోతీర్థంలో గంగ నివసిస్తున్నది. గో ధూళిలో పుష్టి ఉన్నది. దానికి నమస్కరిస్తే ధర్మమాచరించినట్లవుతుంది. అందుచేత గోవుకు సదా ప్రణమిల్లాలి".

ఆర్య జాతి అనాదికాలం నుండీ గోవులను పెంచడంలో శ్రద్ధ వహించింది. గోవును భక్తితో ఆరాధించింది. దానివల్ల ఎంతో లాభపడింది. గోవులు ఆజ్య ప్రదానం ద్వారా యజ్ఞాలకు సహకరించి యజ్ఞాంగాలుగా కీర్తించబడ్డాయి. అందుచేత సత్సంప్రదాయం పాటిద్దాం. గోవులను గౌరవంతో ఆదరించుదాం.

బాల్యంలో మేము ఒక గురుకులంలో విద్యాభ్యాసం చేశాం. చరాచర సుఖాభిలాషిగా ప్రసిద్ధులైన శ్రీమలయాళ స్వామి మహర్షి స్థాపించిన గురుకులమది. ఆ గురుకులంలో ఒకటి రెండు చోట్ల గుండ్రని రాతి స్తంభాలు గురుదేవులు నాటించారు. క్రొత్తగా ఆశ్రమానికి వచ్చిన వారికి ఆ స్తంభం ఎందుకు నాటారో తెలియదు.

ఆశ్రమంలో గోవులున్నాయి. ఆ గోవులు తరచుగా సంచరించే ప్రదేశంలోనే ఆ స్తంభాలు కనిపిస్తాయి. ఆ గోవులకు తమ శరీర పార్శ్వ భాగాలలో దురద కల్గితే, అవి నేరుగా ఆ స్తంభాల వద్దకు పోయి ఆ

స్తంభాలను రుద్దుకొంటూ దురద తీర్చుకొంటాయి. ఆశ్రమ విద్యార్థులమైన మాకు ఆ దృశ్యం తఱచుగా కనిపించేది. చరాచర సుఖాభిలాషిగా పేరొందిన గురుదేవులు ఆవిధంగా గోవులకు గూడా దురద తీర్చుకొనే సదవకాశాన్ని ఆ స్తంభాలు నాటించడం ద్వారా కల్గించారు. అవి సుఖపడేటట్లు సహకరించాలని గురుదేవుల అభిప్రాయం.

అందువల్ల గోవులకూ, మనకూ ఉండే సన్నిహిత సంబంధాన్ని మనసులో పెట్టుకొని వాటిక్షేమం కొరకై పాటుపడవలసిన బాధ్యత మనపై ఎక్కువగా ఉన్నదని గుర్తించి గోరక్షణకై పాటుపడదాం.

---

## కంటి ఆసుపత్రి త్రినేత్ర వైద్యాలయ ట్రస్టుకు ఈ క్రిందివారు పైకం పంపినారు

| | | | |
|---|---|---|---|
| 1. | యు.ఓంకుమార్ (శ్రీకాళహస్తి) | నిధికి | రూ. 21,004/- |
| 2. | వి. శివసుందర ప్రసాద్ (ముంబై) | నిధికి | రూ. 12,000/- |
| 3. | కోసూరు నాగభూషణ హనుమంత్ (సికింద్రాబాద్) | విరాళం | రూ. 5,00,000/- |
| 4. | జి. యస్. రామచంద్రన్(చెన్నై) | నిధికి | రూ. 6,00,000/- |

వీరిని పరమేశ్వరుడు అనుగ్రహించుగాక!

---

## చందాదారులకు విజ్ఞప్తి

వార్షిక చందాదారుల చందా ఈ డిసెంబరు నెలతో పూర్తియగుచున్నది. కాబట్టి మీ చందానంబరు తెలుపుతూ వార్షిక చందా వంద రూపాయలను వెంటనే పంపి రెన్యువల్ చేసుకొనగోరుచున్నాము. పత్రికా ముద్రణ వ్యయము చాల పెరిగినప్పటికి మేము వార్షిక చందా పెంచలేదు. రాబడికంటే ఎక్కువ ఖర్చుతో పత్రిక నడుపుచున్నాము. కాబట్టి దీనిని గమనించి మీ వార్షిక చందా వంద రూపాయలను వెంటనే యం.ఓ. చేసి మీ చందాను రెన్యువల్ చేసుకోగోరుచున్నాము. – పబ్లిషర్

# వార్తలు

1. 19-10-2023 తేది సోమవారం కృత్తిక సందర్భంగా ఆశ్రమ దేవాలయంలోని సుబ్రహ్మణ్యస్వామికి ప్రదోషకాలంలో అభిషేకార్చనలు జరిగినవి.

2. 04-11-2023 తేది తిరుపతి శ్రీమలయాళ సద్గురు సేవాసమాజ కార్యనిర్వాహకవర్గ సమావేశం సమావేశ భవనంలో జరిగినది. సమాజానికి ఇంతవరకు అధ్యక్షులుగా వున్న శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు పరమపదించినందున సమాజ కార్యనిర్వాహక కమిటీకి అధ్యక్షులుగా శ్రీ సంపూర్ణానందగిరి స్వాములవారిని నిర్ణయించడమైనది.

3. 05-11-2023 తేది ఆదివారం శ్రీకాళహస్తి శ్రీ శుకబ్రహ్మాశ్రమంలో సద్గురు సర్వసేవాట్రస్టు బోర్డు సమావేశం ట్రస్టు అధ్యక్షులు పూజ్యశ్రీ సంపూర్ణానదగిరి స్వాములవారి అధ్యక్షతన జరిగినది.

4. 11-11-2023 తేది శనివారము మాస శివరాత్రి సందర్భంగా ఆశ్రమ దేవాలయ నర్మదేశ్వర మహాదేవునకు ప్రదోషకాలంలో రుద్రాభిషేకము, బిల్వార్చన చేయబడి అందరికీ ప్రసాదవినియోగం జరిగినది.

5. 12-11-2023 తేది ఆదివారంనాడు దీపావళి సందర్భంగా ఆశ్రమ శివాలయంలో దీపాలతో ప్రణవం పెట్టి ప్రణవ పూజ చేయబడినది.

6. 20-11-2023 తేది కార్తీక సోమవారం నాడు ఆశ్రమ శివాలయంలో శివునకు రుద్రాభిషేకము, బిల్వార్చన చేయబడినది.

7. తిరుపతిలోని శ్రీ మలయాళ సద్గురు సేవాసమాజ వార్షికోత్సవము మరియు గీతాజయన్తి 2023 డిశంబరు 22, 23, 24 తేదీలందు శ్రీమలయాళ సద్గురు సేవాసమాజ భవనంలో జరుగును. ఆ సందర్భంలో సమాజ సర్వసభ్య సమావేశమున్ను జరుగును.

8. ఆశ్రమ కంటి ఆసుపత్రిలో అక్టోబరు నెలలో ఓ.పి.విభాగంలో **210** మందికి కంటి పరీక్షలు చేయబడినవి. సర్జరీ విభాగంలో**81** మందికి కళ్ళలో పొరలను తొలగించి లెన్సు అమర్చబడినవి **70** మందికి ఉచితంగా కళ్ళద్దాలు ఇవ్వబడినవి.



ఆయుర్వేద మూలపురుషుడు ధన్వంతరి

Regd.No. TRP / 123 / 2021 - 23 December 2023 Rs.10/- R.No.8139/63

Date of Publication 26-11-2023, Permitted to post : 29th, 30th every month.



# త్రినేత్ర వైద్యాలయము

# భక్తకన్నప్ప కంటి ఆసుపత్రి.



**శ్రీశుకబ్రహ్మాశ్రమము, స్వామి ప్రకాశానందనగర్, శ్రీకాళహస్తి, ఆం.ప్ర.**

**ఆపరేషన్ థియేటర్‌లో కంటి ఆపరేషన్ చేయుట**

---

ఈ పేజీ స్థల దాతలు

# సుభద్రా చారిటబుల్ ట్రస్టు

## హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం